Snehalata Kavita Sangham. 44th Flower.

# Kamavilasam



BY

VIDWAN

SARIPALLE VISWANADHA SASTRY, M. A.,

*Professor,*

Nizam College - HYDERABAD.

శ్రీమత్పరదేవతాయై నమః

స్నేహలతా కవితాసంఘ పుష్పము 44.

# కామవిలాసము

గ్రంథకర్త:

విద్వాన్ యస్. విశ్వనాథశాస్త్రి, ఎం. ఏ.

# PREFACE



'Comus' and its contents had a powerful appeal to me in that language, when first I read it as a text-book for my M. A., Examination of the Aligharh Muslim University in 1928. Since then I have an idea of adapting it in Telugu Verse, which has taken shape now, by Mother's will. I fervently hope that the Telugu public will accept it at its worth.

I must not lose this opportunity of thanking Mr. V. Ramasubbarayudu, my friend and president, Snehalata Kavita Sangham for the trouble he has taken in preparing the M. S. for the press and Mr. A. V. Chelapati Rao, a good scholar in Telugu & Sanskrit, for his introduction and for looking into the proofs. Finally I must thank my friend and co-lecturer, Mr. B. V. Rama Narsu for having rendered the prose version of the story.

*Author.*

# OPINIONS

---

I have had the pleasure of looking into some of the writings of Mr. S. Viswanatha Sastri, M. A., and am much impressed by the author's skill and learning. I have no doubt that he will have ample opportunities in the service of His Exalted Highness, the Nizam, for the development of his great powers.

Waltair,
29th Dec., 1934.

(Sd.) S. Radhakrishnan.
*Vice Chancellor,*
ANDHRA UNIVERSITY.

---

" I have read with great interest *Kamavilasam* a Telugu rendering of Milton's *Comus* by Vidvan, S V. Sastri. In my opinion, the author has ably brought out the spirit of the original. His departures from his source mainly consist in the replacing of classical allusions of which Milton's poem is so full, by references to our own puranic tales and legends which the average Telugu reader will more readily appreciate. It is the duty of every lover of Andhra culture to do his bit for the enriching of Modern Telugu literature and Mr. Sastri's attempt is therefore a step in the right direction.

Hyderabad (Dn)
25th March '35.

(Sd.) T. Virabhadrudu,
M. A., L.T.
*Professor of English,*
OSMANIA UNIVERSITY COLLEGE.

---

**A SUMMARY**

*of the story of*

# "COMUS"

---

The hero of the story or the villain of the piece, is Comus, born of Bacchus, the wine god and Circe, the sorceress. As is natural in such cases, he combines in himself the sorcery of his mother and his paternal heritage of love for wine. His trade for mere love of it, is to lure innocent travellers of the forest into tasting his magic wine which has the quality of transforming them into men with animal faces. As a record of past achievements, he has with him a riotous gang of fallen men roaming about the wood with their master enchanter.

Once, as ill-luck would have it, a handsome young lady and her two brothers of aristocratic descent, had to pass through that infested wood on the way to their father's house, where he was to be invested with his ducal power. The lady feels exhausted and hungry and her brothers go in search of find-

ing out for her some nurishment but lose their way in the forest. Night descends and a thousand phantasies haunt the lady's memory, when she is thus left to herself. That is the occasion and opportunity for Comus to introduce himself to her and to spread his net round his fair victim in the guise of a harmless villager. He resolves to make advances to her and own her as his queen. In order, however, to put his victim off the scent, he first learns the story of her lost brothers from her and promises to escort her to them after a night's rest.

Meanwhile, the brothers feel sorry for their sister left alone; but feel confident that her chastity and force of character will protect her from the clutches of evil.

Their worst fears proved true, when the attendant spirit, disguised like their father's shepherd, appears before them to disclose what befell their unhappy sister. The brothers in great rage prepared to find out and chastise Comus; but are disillusioned by the shepherd about the possibility of force succeeding against one armed with charms and

magic. He tells them also that he knows of a magical herb called "Haemony", which has the power of counter acting the evil influences of Comus' enchantments. Armed with this, they proceed in search of Comus' den, to break his glass of wine and seize his wand, the two main forces of his evil influences.

At the other end, the lady is led by Comus, and his crew to a magnificent palace set out with all manner of deliciousness, where the lady is made to sit on an enchanted chair from which she cannot move and is offered a glass of wine. Comus offers to win her over with apparently convincing arguments that elevate gross materialism and profligacy to the level of virtue, which the lady rebuts with an equally forceful answer in defence of true virtue and chastity.

At this juncture, the two brothers rush in, wrest the glass out of Comus' hand and break it into pieces. His gang is held up but Comus escapes with the magic wand and the shepherd brings it to the notice of the brothers that without the wand being snatched, the lady cannot be freed from the bonds of

enchantment. But all is not lost; for the good shepherd suggests invoking the help of "Sabrina", a river goddess, who is the protector of virginity and who has the power of undoing the mischievous effect of Comus' black magic. Sabrina is accordingly invoked. She comes at once and sprinkles holy water thrice on the lady's finger tip and thrice on her rubied lip. The spell then loses its fell grip on the lady and she is led in safety to her father's palace to increase their merriment and happiness.

Having thus discharged her labour of love, the attendant spirit disappears to happy climes, where day never shuts his eye, exhorting mortals to love virtue, lest, otherwise, the wrath of heaven should descend on them.

---

# పీఠిక



శ్రీమంతం బగు మన భరతఖండంబున వేదశ్రోత్రియులును మహాత్ములును లోకుల ననుగ్రహించుతలంపుతోడ ననేక మోక్షగ్రంథరాజముల ననుగ్రహించియున్నారు. తరువాతఁ గొన్ని వేదాంతగ్రంథములను గొందఱు మహాత్ములు కావ్యనాటకరూపములతోఁ బ్రజానురంజకముగ విరచించియుండిరి. ఇట్టి గ్రంథములలోఁ బ్రబోధచంద్రోదయ మనఁబడు సంస్కృతనాటక మొకటి. ఇయ్యది కృష్ణమిశ్రరచితము. దీనినే మాతృకగఁ గైకొని వరాహపురాణాది గ్రంథకర్త లగునంది మల్లయ్య, ఘంట సింగయ్య యనెడిజంటకవులు తెలుఁగులోఁ బ్రబంధరూపమున రచించి గంగనామాత్యున కంకితముఁ గావించియున్నారు. ఇట్లె సంకల్పసూర్యోదయ మనెడి యింకొక సంస్కృతగ్రంథముకూడఁ గలదు. ఇట్టిదే వేఱొక్కటి జీవానందనాటక మను పేరుతో విలసిల్లుచున్నది. ఈ కావ్యరత్నములు లోకమునకు జ్ఞానప్రబోధ మొనర్చుటకుఁ బూర్వకవులచే రచియింపఁబడియున్నవి.

ఇంచుమించుగ నిట్టి సన్మార్గప్రవర్తనలఁ గఱపునట్టి "రామవిలాస" మను నీకావ్యమును బ్రహ్మశ్రీ సరిపెల్ల విశ్వనాథశాస్త్రిగారు రచించి మన కొసంగియున్నారు. ఇది గేయఫణితిలో వ్రాయఁబడినది — స్త్రీలసౌశీల్యము, మనుజుల సద్వర్తనము, వీని నాధారములుగఁ గైకొని యీకావ్యము రచింపఁబడినది.

## కవిప్రశంస

ఈ కవిచంద్రులు సంస్కృతాంగ్లభాషలయందు 'యం. యే.' పరీక్ష నిచ్చియున్నారు. ప్రాచ్యబిరుదములందు 'విద్వాన్' బిరుదమును గడించియున్నారు. వీరి మేధాశక్తి కడుం గడు నపారముగఁ దోఁచుచున్నది. వీరు మూఁడుభాషలలో నిరతిశయోత్తమపాండిత్యమును సంపాదించియున్నారు. ఇట్టి మేధావులు నాఁట నాఁట నొక్కరిద్దఱుందురేమో. ఇట్లనితర దుర్లభమగు శేముషీమహిమల గడించినట్టి వీరిని గౌరవించి సత్కరించి మద్రాసువిశ్వవిద్యాలయమువారు వీరిచే నెన్నియో యమూల్యోపన్యాసముల నాంధ్రవిమర్శనగూర్చి యిప్పించి యున్నారు. ఈయుపన్యాసము లాంధ్రభాషాయోషామణి కపూర్వాలంకరణములై విలసిల్లుచున్నవి. "ఆంధ్రవిమర్శకుఁ" డనెడి పేరుతో నీయుపన్యాసము లన్నియు నచిరకాలములో ముద్రింపించి జిజ్ఞాసువు లగునట్టిమనయాంధ్రమహాశయులకు దయతో నందఁజేయుదురుగాక యని వీరిని బ్రార్థించు చున్నాను. వీరు ప్రస్తుతము హైదరాబాదులో నైజాము కాలేజీలో నొక యాచార్య ( Professor ) స్థానము నలంకరించుచున్నారు. వీరు చక్కని కళోపాసకులు. దేవీ పూజాధురంధరులు. ఇదివఱకే వీరిచే "లలితాశతకము, హంసతారావళి" మున్నగు గ్రంథములు రచింపఁబడినవి. ఇయ్యది వీరికవితాకల్పలతకుఁ బూచిన మఱొక్కకుసుమరాజము. వీరు స్నేహలతాకవితాసంఘమునందుఁ బ్రధానసభ్యులై, తాము రచించినట్టి యమూల్యకావ్యరత్నముల స్నేహా

లతామతల్లికే కానుకలుగా సమర్పించుచున్నారు. వీరిని ప్రోత్సహించి వీరి మేధాసుధాంబుధిలో దాగియున్న మాణిక్య సాధుకృతులను సంఘసభ్యులకేగాక యితర పాఠక మహాశయులకు సైతముఁ జవిచూపించుటకుఁ దోడ్పడిన మహానుభావులగు బ్రహ్మశ్రీ వాజపేయయాజుల రామసుబ్బారాయుఁడు, బి. ఏ. గారెంతయుఁ బ్రశంసార్హులు. వారి కనేక నమస్కారము లర్పించుచున్నాఁడను. వీరిప్రోత్సాహబలముచేఁ గాకున్న నిట్టి గ్రంథములు మనకు లభించియుండవు. ఇయ్యది స్నేహలతా సుమరాజిలో పలు దినాలవదియై విరాజిల్లుచున్నది. స్నేహలతాకవితాసంఘము నిరంతర మిట్టిపుష్పములనే పూచుచుండుఁగాక !

## గ్రంథప్రశంస

ఈ కామవిలాసమునకు మాతృక యేదియున ఆంగ్ల భాషలోఁ గవిశిఖామణులం దగ్రస్థాన మలంకరించిన మిల్టన్ (Milton) కవివర్యునిచే రచింపఁబడిన (Comus) కోమసు నాఁబడు నీతిబోధక మగు చిన్ననాటిక. ఈ యాంగ్లనాటక కవిత్వమాధుర్యముతో సరితూగిన శ్రావ్యకావ్యరాజము లేనే లేదని జాన్సను (Johnson) కవి దీనిని స్తోత్రము సల్పుచున్నాఁడు.

**" A work more truly poetical is rarely found "** ***Johnson's " Life of Milton "***

" కవితాకళ నింతకంటె యథార్థముగ శోభింపఁజేయు కావ్య మెందును బ్రాయికముగఁ గానరాదు "

జాన్సన్ వ్రాసిన " మిల్టన్ చరిత్రము "

ఇట్టియుత్తమగ్రంథమును వ్రాయుటకు మిల్టన్ కవిని బురికొల్పిన మూలకారణము తత్కవిశేఖరునకు నీతిప్రవర్తనయందును ధర్మానుష్ఠానమునందును దైవభక్తియందును గల నిరతిశయవిశ్వాసమే సుమీ. ఈకవిచంద్రునకు దుర్వ్యసనలౌల్యముగాని దుష్పథసంచారముగాని వినుటకేనియు దుస్సహములు. స్వచ్ఛమై నిష్కలుషమై సదాచారసంపన్నమైనట్టి జీవితయాత్రయే యీకవిచంద్రునికిఁ బరమావధి. ఈభావమునే "**Wordsworth**" అనునొక యాంగ్లమహాకవి **Milton** గుఱించి యిట్లు వెలిఁబుచ్చెనుగదా.

**Thy soul was like a star and dwelt apart**
**Thou hadst a voice whose sound was like the sea**
**Pure as the naked heavens, majestic free**
**So did'st thou travel on life's common way**
**In cheerful godliness, and yet thy heart**
**The lowest duties on herself lay.**
**" Plain living and high thinking**
**was his motto in life. "**
**Milton himself had expressed in**
**the sonnest on his blindness**
**" who best**
**Bears his mild yoke, they serve him best. "**

ఇట్టి సద్గుణగణగరిష్ఠులలోఁ జేరినమహనీయుఁడు మిల్టను మహాకవి. సౌశీల్యమునకు సత్ప్రవర్తనమునకు దైవసహాయమెల్లపుడు సన్నిహితమై యుండుననియే యీకవి చేయునట్టి ప్రబోధసారాంశము. ఇక్కథలోఁ గామునిచేతఁ జిక్కినసుశీల కుదకు ధర్మదేవతచేత నధర్మపాశములనుండి విడిపించఁబడి

రక్షింపఁబడినది. ఇట్టినీతులను నిరూపించి ప్రజలను సన్మార్గప్రవర్తకుల నొనరించుటకే మిల్టన్కవి యీగ్రంథమును రచించియున్నాఁడు. దీనినే ముఖ్యోద్దేశముగఁ గైకొని శ్రీ విశ్వనాథశాస్త్రిగారు కామవిలాసకావ్యమును దెలుంగుబాసలోనికి ననువదించిరి.

## నాటకలక్షణము

మిల్టన్కవిచేత రచింపఁబడిన 'కోమస్' గ్రంథము నాటకమా, ప్రబంధమా యనుసందేహము పలువురకుఁ గలుగవచ్చును. ఇది నాటకములలో నొకతెగకుఁ జెందియున్న దనవలసినదే. కాని కొందఱాంగ్లభాషావేత్తలు దీనిలక్షణములు సక్రమనాటకమునకు సరిపోఁగుట లేదని, నాటకపరిగణనకిది బహువిధములఁ గొఱవడుచున్నదనియుఁ దలంచుచున్నారు. ఆంగ్లేయదేశమునందలి నాటకరంగపద్ధతు లిప్పటివలె వికసించి విజృంభించకపూర్వ మిట్టినాటకములే రచింపఁబడుచుఁ బ్రదర్శింపఁబడుచు వచ్చినవి. మన దేశములో నాటకభవనములు తెరలు మున్నగు జవాహిరీలు లేకమునుపు ప్రదర్శింపఁబడుచుండిన వీథినాటకములు కూచిపూడిభాగవతములను బోలినదై యీనాటిక కన్పట్టుచున్నది. ఇట్టి నాటకములు ధనికాంగణములందు మహోత్సవకాలములలోఁ బ్రదర్శించునట్టి యాచారము సీమదేశములోఁ గలదు. ఇందు సద్గుణములు దుర్గుణములు మానుషవిగ్రహములు ధరించినట్లును శిష్టగుణములచేతిలో దుష్టగుణము లోడిపోయినట్లును జిత్రింపఁబడి ప్రచ్ఛన్నగుణపాత్రారోపణ లిందుంచఁబడుటచే

నిది " ప్రచ్ఛన్న " ( Masque ) నాటకమందురు. కావు నసే యిది నాటకములలో నొక్క తెగకుఁ జెందినదని వ్రాసి నాఁడను.

ఛందోవిచారణ

ఈకామవిలాసమునం దుపయోగింపఁబడినవృత్త మొక మిశ్రజాతికిఁ జెందియున్నది. చాలవఱకు ద్విపద ననుకరించు చున్నది.

ద్విపదలక్షణము :

సురపతిత్రితయంబు సూర్యుఁ డొక్కఁడు
విరమంబు రెంటిపై వెలయు నొక్కటికి.

( అప్పకవీయము. )

ఇట్టిలక్షణము ననుకరించుపంక్తు లనేకములు గలవు.

ఉదా:- ధర్మమే స్వర్గంపుఁ దాళముఁ దీయ
ర త ర హ

ఇట్లే కొంతగ్రంథము ద్విపదలో గానముసేయఁబడినది కాని ద్విపదలోవలె నిచ్చట రెండురెండుపంక్తులకుఁ బ్రా సముచూపట్టుటలేదు. ఇంకొకవిశేషము కలదు. ద్విపదవృత్త మునకుఁ బ్రాసమును విడిచిపెట్టి వ్రాసినచో " మంజరీ " వృత్త మను పేరుతో విలసిల్లుచున్నది.

మంజరి : మోదంబు పెంపార భూమిలోపలను
బద్మాక్షుఁ డెపుడుఁ జేపట్టు మంజరుల

( అప్పకవీయము )

ఈపైపంక్తులజంట ద్విపదవృత్తమేకాని ప్రాసము లేనిహేతువుచే మంజరీవృత్తమైనది. కావున మన గ్రంథము మంజరీవృత్తమని చెప్పవచ్చును.

ఇంకొక విషయము కలదు. ద్విపదలక్షణమునకుఁ దొల్లింటి మూడుగణంబులు నిండ్రగణంబులుగదా. ఇంద్ర గణములలోఁ గొన్నింటికి నాల్గుమాత్రలు మఱికొన్నింటి కైదుమాత్రలును గలవు.

| | | | | | | |
|---|---|---|---|---|---|---|
| గణము - | నల | నగ | సల | భ | ర | త |
| మాత్రలు - | 4 | 5 | 5 | 4 | 5 | 5 |

ఈపైఁ గనుపఱచినపట్టికలో - సల - భ - గణము లందుఁదక్కఁ దక్కినవానిలో నైదుమాత్రలు కలవు. ఇవ్విధ ముగఁ బంచలఘుక్రమమునకుఁ గొఱఁతపడిన - సల - భ - లకు నొక్కొక్కలఘువును జేర్చితిమేని యింద్రగణంబులందు సమానమాత్రసంపత్తి సిద్ధించును. ఇట్లు సిద్ధించిన పంచలఘు క్రమము ననుసరించి ద్విపద వ్రాసితిమేని "కర్ణాటచౌపది" వృత్త మొకటి యేర్పడును.

కర్ణాటచౌపది :

| | | | |
|---|---|---|---|
| అగువిశ్ర | మమ్మొక | ర్ణాటచౌ | పది,యొ |
| నగ | ర | ర | న |
| సఁగుఁగృతుల | సత్కవుల | సమ్మతుల | తోడ |
| నలల | భల | భల | హ |

(అప్పకవీయము)

ఈకర్ణాటచౌపదివృత్త మీగ్రంథమునందుఁ గొన్ని తావులలో వ్రాయఁబడినది.

ఉదా :-

| | | | |
|---|---|---|---|
| కలరూపుఁ | దెల్పెదను | గననివిన | నట్టి |
| సల | భల | నలల | హ |
| గాథల | గీతములఁ | గవులెఱుఁగు | నట్లు |
| భ | భల | నలల | హ |

కాని యిది కర్ణాటచౌపదివృత్తమని నిర్ధారణఁ గావింతమన్నచో వాలుగేసి పాదముల కొక్కప్రాసము లేమిఁజేసి యది వలనుపడకున్నది.

కావునఁ గామవిలాసమునం దుపయోగింపఁబడిన వృత్తము మంజరి - కర్ణాటచౌపది - వృత్తమిశ్రమ మగుట వలన దీని నొక "కర్ణాటమంజరీ" మిశ్రజాతివృత్తమని నిర్ధారణము గావింపవచ్చును.

ఇది చక్కఁగ గానముసేయుటకుఁ జాలినంత సౌకర్యముల నిచ్చుచు మంచిహంగాయలు గలనడకతోఁ బరుగెత్తుచుండును. ఇట్టివృత్తములం దలరారుసహజమనోహరగమన మానందదాయకమేగానిచో శ్రీనాథుఁడు పల్నాటిచరిత్రమునుగాని రంగనాథుండు రామాయణమునుగాని ద్విపదవృత్తములలో విరచించియుండరు. ఈవృత్తము నవలంబించినంత మాత్రన గ్రంథమున కెట్టిన్యూనతగాని సేకూరదని నా రూఢివిశ్వాసము. మూలగ్రంథములోని (Songs) పాటలకు బదులుగఁ జక్కనిగేయములు సరళగతిఁతో మృదుమధుర ఫణితిలో వ్రాయఁబడినవి.

ఈకర్ణాటమంజరివృత్తములో నిటీవలనే కొందఱు కవులు గ్రంథనిర్మాణముఁ గావించియున్నారు. ఆధునిక కవులుకూడ నీనూతనపద్ధతినే యవలంబించుచున్నారు. ఏది యెట్లున్ననుగూడ నీవృత్తముమాత్రము ఛందోబద్ధ మైనట్టిదే కాని చిల్లరలొల్లాయపదములలోఁ జేరికగాదు. ఇట్టి మిశ్రవృత్తములు ఛందశ్శాస్త్రమునం దెన్నెన్నియో కలవు. సరళ

ధ్వనిప్రాధాన్యమును వహించిన సులభక్రమగానానుకూల్యమును సమకూర్చుటయే ఛందశ్శాస్త్రముఖ్యోద్దేశము కదా. అయ్యది దా మెతెగ నిందు సిద్ధించుచున్నది.

## అనువాదములు - అనువాదపద్ధతులు.

ఈకాలమునం దనువాదములుగాని యనువాదపద్ధతులుగాని సాధారణముగాఁ బరిహాసమునకు గుఱియగుచున్నవి. అనువాదప్రయత్నమే గ్రామ్యమని (Translation is vulgar) కొందఱిచేత నీసడింపఁబడుచున్నది. ఏలయన ననువాదమన్నంతనె యొకానొకనీచసత్వము ద్యోతకమగుచున్నది. ఒకభాషనుండి యింకొకభాషకుఁ బయనమై పోవునప్పుడు మాతృక మధ్యమార్గంబున గంధవహచోరగ్రస్తమై సౌరభము ననివార్యముగఁ గొంత కోలుపోవలసియున్నదని పలువురు తలంచుచున్నారు. ఇయ్యది కొంతవఱకు సత్యమే కావచ్చును. ఎన్నివిధముల సానబాపిడివెట్టిననుగూడ ననువాదము మాతృక కానేరదు. ఛాయాఫలము యథార్థమగునా! కాని యుపమానమునకు నుపమేయమునకు సర్వలక్షణసామ్యమే సిద్ధించవలసినచో దానికది యొక్కటియె సాటియై వస్తువులందు ద్వైతము నశించి యద్వైత మేర్పడునుగదా. అప్పుడు "కేన కిం పశ్యేత్, కేన కిం విజానీయా"త్తన్నట్లుపమాలంకారమే యసంభవమగును. మొదటికే మోసము వచ్చును. కావున ననువాదములందు సారూప్యసిద్ధి తక్క సాయుజ్య మసంభవము. ఇంకొక చిన్నవిశేషము కలదు. అట్టిమాతృక యేసంస్కృతభాషలోనిదో గాని లేక

యేయితరనిజదేశీయభాషలలోనిదోగాని యగునెడల నప్పుడనువాదకునిపని కొంత తేలికపడును. అన్యదేశవస్తువుల ననఁగాఁ బాశ్చాత్యగ్రంథముల నాంధ్రీకరించుచో వారివారి విపరీతసాంప్రదాయములను, వారివారిప్రవర్తనవ్యత్యాసములను, వారివారివిచిత్రాభిరుచులను మక్కికి మక్కి మూటఁగట్టి తెచ్చి యనువాదమునం దిముడ్చితిమేని రసహీనమగును. ఎట్లనిన మూలగ్రంథమునందుఁ గ్రిస్టుబైబిలు ప్రశంసింపఁబడినయెడల నట్టిగ్రంథముల నాంధ్రీకరించునప్పు డేకృష్ణపరమాత్మనో వేదములనో గానముసేసితిమేని యెంతో సారస్యము గూర్చును. అట్టిచో నితరదేశవిపరీతవాసనలు నాసికల కందవు. దేశ్యశోభలే నైసర్గికవాసనలే యెచ్చటఁజూచినను మనోవినోద మిచ్చుచుండును.

ఇట్లుండ నొకభాషనుండి యింకొకభాషలోనికి గ్రంథమును మార్చునప్పుడు రెండువిధములమార్గము లేర్పడుచున్నవి. భాషానువాదము - రసానువాదమని రెండుత్రోవలు కలవు. మాతృకలోనినామధేయములను వాక్యములను, గాథలను మార్చక యున్నదాని నున్నట్లుగ నుంచి భాషాపరివర్తనము సమకూర్చుటయె భాషానువాదము (Translation) నాఁబడుచున్నది. ఇట్లుగాక మాతృకలోని పేరులను, గాథలను, మహాశయములను భాషానైసర్గికమగునట్లుగ మార్చి మూలవస్తువును బరివర్తించుటయె రసానువాదము (adaptation) నాఁబరఁగుచున్నది. ఈరసానువాదపద్ధతి శ్లాఘాపాత్రమనక తప్పదు. ఏభాషగాని యభివృద్ధిసెందవలయునన్నచోఁ దగిన

యవకాశముఁ గైకొని సర్వజాతులుంగూడఁ దమతమభాష లోని కీర్తకభాషలందుఁ గలగ్రంథరాజముల ననువదించికొను చు నిర్విఘ్నమున విజ్ఞానవినిమయము (Exchange of Culture) నకుఁ దోడుపడవలసినదే. ఇందు నైచ్యము కాని హైన్యముకాని యేమాత్రమేనియు లేదు.

ఇంతదూరము విస్తరించి యిఁకముందుఁ గామవిలాస గ్రంథానువాదస్వభావచర్చకుఁ గడంగెదను. ఇయ్యది మూల వస్తువులోనికథాసంవిధానమును మార్చక తద్గాథాసాంప్ర దాయముల దేశ్యములుగ మార్చికొనుచు ననువదింపఁబడినది. దానంజేసి యెచ్చటఁజూచినను గూడ నియ్య దాంగ్లానువాద ముకాక స్వతంత్రరచనయేమో యనుభ్రాంతి పుట్టించుచు న్నది. పాశ్చాత్యపురాణగాథలు పల్కరింపఁబడినచోటులం దెల్లెడలఁ దత్సదృశము లగుభరతదేశగాథలే గానము సేయఁ బడినవి. సీత, దమయంతి, సావిత్రి, రావణుఁడు, పాశుపతము, సుదర్శనము - వీని నన్నింటిని బాశ్చాత్యగాథానకూలము లుగ మార్చి గ్రంథకర్త సంస్కార్యానుసారముగ నిందుఁ జొప్పించియున్నాఁడు.

ఇం దింకొకయపూర్వ మగుమెఱుఁగు గన్పట్టుచున్నది. రసోత్పాదనమే ప్రధానకార్యముగ గ్రహించినట్టి యీకవి వర్యునిచేఁ బలుతావులందలి తావులందులుపకుండ ననువాద స్వాతంత్ర్య మవలంబింపఁబడినది. మూలగ్రంథములోని పా శ్చాత్యులయభిరుచులకు మనయభిరుచులకు వ్యత్యాసముకన్ప ట్టినచోటులందు లోటురానీకయ యీస్వాతంత్ర్యము గ్రంథ

కర్తచే వినియోగించుకొనఁబడినది. నాయభిప్రాయము నొక్కయుదాహరణముచేత విశదీకరించెద సరిగనుండును. మిల్టన్ కవి కామినీవిలాససౌందర్యముల వర్ణించునప్పుడు వెండ్రుకలు చందురునిబోలి (Tresses like the moon) యున్నవని వర్ణించియున్నాఁడు. ఈపంక్తికి భాషానువాదము " జాబిలికి సరితూగుచక్కనికురు " లని యేర్పడును. ఔరా! దీనిఫలితమేమి! జిలుగుఁబ్రాయంబున మిసమిసలాడుచున్న లేతసవలామణి, యక్కటా! దుష్టానువాదభ్రష్టయై ముగ్గుబుట్టవలెఁ దల నెరిసినముసలమ్మ యగునుగాదా? ఇట్టిభాషానువాదము రసావాసమో, రసాభాసమో చదువరు లెఱుంగకపోరు. కాని మనగ్రంథకర్త మిక్కిలిజాగరూకతతో నాపంక్తికి రసానువాదపద్ధతి ననుసరించి " తుమ్మెదలబారులకుఁ దులవచ్చుకురు " లనివ్రాసి స్వతంత్రించి పాశ్చాత్యాభిరుచిని మార్చి దేశీయభాషాసాంప్రదాయానుకూలముగఁ జిత్రించియున్నాఁడు. ఈదృగ్విధానమే రసానువాద మనంబడును. ఇట్టి యపూర్వశోభ లీపొత్తమునం దెల్లెడల వెదఁజల్లింపఁబడినవి. గ్రంథవిస్తరభీతిచే వాని నన్నింటి నుదాహరింపమానినాఁడను.

## ప్రబోధచంద్రోదయము

ప్రబోధచంద్రోదయములోని గాథకును దీనిలోని గాథకును జాలవ్యత్యాస మున్నది. మూలాశయమునందుఁ బాత్రనిర్మాణమునందుఁ గొంతకొంతసామ్య మున్ననుగూడ నీరెండుగ్రంథములు పృథక్స్వభావములు కలవానివలెఁ గను

పట్టుచున్నవి. కామవిలాస మడవులలోఁ జీకటిలో రంగస్థల మేర్పఱుచుకొని తెన్నెఱుంగక పెడదారులం బడి, యన్నుల నిద్దర విడి, కామునివలలం దగులువడి, వానిలాలనలకుఁ దెలివిఁగోల్పడి, మాయాపాశబద్ధయై కన్యాత్వము చెడిపో నున్నట్టి సందిగ్ధావస్థలో నొకసాధ్వినిఁ దద్వనితాపాళిల్యమున కేమాత్రము భంగము రానీక ధర్మదేవత కాపాడినట్లు చిత్రింపఁబడియున్నది. ఇట్లుండఁ బ్రబోధచంద్రోదయములో మోహమహారాజు వివేకచక్రవర్తిచే నోడిపోవుట మిక్కిలి రాజకీవితో వర్ణింపఁబడి, రాయబారములు, మంత్రులు, దూతలు యుద్ధములు మొదలగు రాజ్యరాజ్యాంగములు రాజసముగాఁ జిత్రింపఁబడియున్నవి. కామవిలాసకథ కాఱడవులందుఁ గటికచీఁకటిలో దేవులాడుచున్నది. ప్రబోధచంద్రోదయకథ రాజసభలలో విద్యుద్దీపములముందటఁ జిందులాడుచున్నది. వీనిరెంటికినిఁ జాలన్యత్యాసమున్ననుఁ గొన్నికొన్ని సమానాశయముల మున్నందు నిరూపింతును.

## కవితాప్రశంస

ఇందలికవిత్వము చక్కనిధారాశుద్ధితో విలసిల్లుచు మృదుపదసంపదతో నలరారుచు మిక్కిలిమనోరంజకముగ నున్నది. పలుతావులం దీకవిశేఖరులు పసందులగుపలుకుల నుపయోగించి మనోహరముగ నుండునట్లు విరచించియున్నారు. అట్టితావుల నన్నింటి నొక్కొక్కదానిని నిరూపించవలయునన్నచో గ్రంథముకంటె నెంతో పీఠికయే పెద్దదగునను భీతిచే సంక్షేపముగ నాస్వల్పబుద్ధికి గోచరించినంతవట్టుకు వ్రాసి చూపించెదను.

## కవనధార

ఈక్రిందిపంక్తులలో నికవిత్వము కడుధారాళమైచక్కని తీవితో నడచుచున్నది.

మొఱకు నటు గాకున్న ముంగురులఁ బట్టి
కడికంపలుగఁ గోసి కాకిగ్రద్దలకు
బలియిత్తు భూభారము వాసిపోవంగ. కాము. 807-810.

పగ లెల్లఁ బొలములోఁ బాటుపడి యస్త
కాళ్ళీడ్చుకొని యింటికై వచ్చువేళ
కూటికై కర్షకుఁడు మూల్గుచున్న వేళ
కంట నేఁ గికలను గమనించుగాను. కాము. 401-404.

మూఢ ! పేరిలకు మోక్ష ముట్టు నటు పరము
స్వేచ్ఛాపునోప్తిఁ జెసక నీ కగున
భౌతిక శరీరమున బంధముల్ నీకు
మాయల నొఁగాక మనః భాగ్యఁపు. కాము. 877-880

సమానాశయము

మ. ఇక నాతల్లి యితండు తండ్రి యిది నాయిల్లిక శత్రుంబు నా
యిగి నాబిడ్డలు వీరు నాహితులు వీరే వైభవం బెల్ల నా
యది యంచున్ జనమానసోదయముఁ దవిద్యానిద్ర ఘూర్ణిల్లుచున్
సద సద్వస్తువివేకి యయ్యుఁ గను సంసారామితస్వప్నముల్.

ప్రబోధచంద్రోదయము 1-77

## నీతిబోధ

ఈకవిశేఖరులు నీతివైరాగ్యద్యోతకము లగుకొన్ని ఘట్టములందు మిగులహృదయరంజకము లగుపంక్తుల విచ్చల విడిగ వెదఁజల్లియున్నారు. వానిం గొన్నింటిని స్థాలీపులాక న్యాయముగ నిచ్చుట సూచించెదను.

నిర్మలరవిదీప్తి నిండుమది నున్నఁ
బట్టపగ లనిపించు వరకౌళరాత్రి
పాపి యగుచో మలిన భావంబు లెసఁగి
పగలె దోషము ముట్టి భ్రమచెంది తూలు
తనమనసు నరకమై తలకించు సతము. కౌమ. 509-513

**He with his bare wand can unthread thy joints**
**And crumble thy senews. "Comus" 614-615**

కుంచె వాడించెనా కూలుఁ గీల్బలిమి
యంగముల్ ముద్దలై యాకృతు లడఁగు. కౌమ. 815-816

**Yea! even that Mischief Meant more harm**
**Shall in the happy trial prove most glory**
**But evil on itself back recoil "Comus" 591-594**

................ కష్టమెంతైన
సుజనుల శోధించి సుఖమిచ్చుఁ దుదకు
తనదౌష్ట్య మెంతయుఁ దన్నె బాధింపఁ
దాఁద్రవ్వుగోతిలోఁ దాఁ గూలు శఠుఁడు. కౌమ. 784-787

## ప్రకృతివర్ణనము

ఇట్లుండఁ బ్రకృతిశోభలనుగాని కామినీవిలాసవర్ణనములనుగాని పాడవలసివచ్చినప్పుడు తత్తద్భావములేమి పదములపొందిక యేమి యనువాదమునందుసైతము మిక్కిలి హృదయరంజకముగఁ జిత్రింపఁబడియున్నవి. ఈక్రిందిఘట్టములఁ బరిశీలింపుఁడు.

**Thrysis ! Whose artful strains have oft delayed**
**The huddling brook to hear his madrigal**
**And sweetened every musk rose of the dale**
**"Comus" 494-496**

ధర్మ:- కమ్మపిల్లనగ్రోవి కలియూదిగాన
కళ.వినఁ బర్వెడుఁ గలికిపెలయేరు
తుళ్ళింతలోఁ గొంత తూగి తా నిలుచు
పరిశపమాధుర్యంబు పఘ్లిలఁజేసె. కొము. 658-661

**What need the vermil-tinctur'd lips for that,**
**Love-darting eyes and tresses like the moon,**
**There was another meaning in these gifts**
**Think what and be advised, you are but young yet!**
**"Comus" 753-756**

చదలేటిబంగారుచాయ గలమేను
తుమ్మెదబారులోఁ దులఁదూఁగువేణి
శితకొండజాలమ్ముఁ జిమ్ముకందోయి

* *

అర్థాంతర మగునియందచందములు
తారుణ్యవతి వీవు తలపోసి చూడు. కొము. 994-1001

మాత్రాశాపి స్తృతి.

వీరికవితారస మొక్కెడ నక్కడక్కడ మూలగ్రంథ మునందలి మాధుర్యమును వెల్లివిరియించి విస్తరించి మాత్ర కకుంగూడ మెఱుంగులువెట్టుచున్నట్లు కనుపట్టఁగలదు. ఈ విధముగ వన్నెలుచిన్నెలు తీర్చి దిద్దఁబడిన తావుల నొకటి రెంటి నిచట నుదాహరించెదను.

**You may as well spread out the unsunned heaps**
**Of miser's treasures by an outlaws den**
**And tell me it is safe, 'Comus' 398-400**

లోభి దాఁచినపెట్టెలో నున్న ధనము
దొంగవాఁకిటఁబోసి దొసఁగేమి యనుట :
దీప మిడి గాలిలో దేవ! నీమహిమ
యని మ్రొక్కి నిలచినటు లగుఁగాదె యన్న! కొము.534-537

**If this fail**
**The pillar'd firmament is rottenness**
**And earth's base built on stubble "Comus"597-599**

దీనికిం దప్పిన స్థిరఖగోళంబు
క్రుళ్ళినగుడ్డంబు ; కొండలంగాక
యెండుటాకులమీఁద నిలగట్టి రంబు
బ్రహ్మాండభాండములు పగిలిపోకున్నె
యుదధు లేడును గలిసి యొక్కటైపోదె. కొము. 794-798

ఇట్టి మూలకలోనిసారాంశములు మనోహరముగ విస్తరింపఁబడినవియై సారస్యమును బోధించుముద్దులు మూరిపెములఁ దొలుకాడుచున్నవి.

### పురాణగాధలు.

ఇంకొక విశేషము కలదు. కథయందచ్చటచ్చట మూలగ్రంథమునఁ బాశ్చాత్యపురాణగాధలను గొన్నింటి నాంగ్లకవిచంద్రుఁ డిమిడ్చియున్నాఁడు. వాని నాంధ్రీకరించు నప్పుడు మనగ్రంథకర్తచే నట్టితావులందు భరతవర్షములోని పురాణగాధలు సందర్భోచితమగురీతితో నిందుఁ బొందుపఱుపఁబడినవి. దీనంజేసి కథారసపోషణము సమకూర్పఁబడుటయె గాక చక్కనిభావసామరస్యము రచనాసారస్యముకూడ నలవ

రింపఁబడియున్నవి. ఇందు మూలగ్రంథమునందున నొక్క దేవత కన్యాసాశీల్యరక్షణార్థమై రంగముపైకి నాహ్వానింపఁబడినది. ఈమె (made the goddess of a river) యొక నదీదేవత. దీని నవకాశముగఁగొని కామవిలాసమునందు సరస్వతీనదీదేవతను జిత్రించుటచేఁ గావ్యమున కెంతయో శోభ సమకూర్పఁబడినది.

నాఁటనుండియుఁ గన్నె నామమున లోనఁ
బ్రవహించు నది సరస్వతి యనఁగ నొప్పె.

ఇట్టి దమయంతి సావిత్రి సీత మొదలగు సౌశీల్యఖనులచరిత్రలు సందర్భానుసారముగ గానము సేయఁబడినవి.

## ఉభయభాషలు.

ఇందు సంస్కృతాంధ్రభాషలు సమభాగములుగ మేలవించి యుపయోగింపఁబడినవి. ఈకవికి సంస్కృతాంధ్రాంగ్లేయములందు నిరతిశయోత్తమపాండితి కలదుగాన నిట్టి మనోహరవివిధభాషాసమ్మేలనమున కెంతయు వీలుకలిగినది. ఇయ్యది వీరిపుణ్యావిశేషము.

## సంస్కృతపదలాలిత్యము.

పతమానౌషధము లవి పావనవిమల
వాహినీగర్భసంవర్ధితకమల
సరసను ధామోద సాంద్రకంకణము, 1229-31

* *

శిశిరశరదాపగాజీవకల్లోల
చండోద్ధతుల్ పంకసాత్కృతముగాక. 1256-57

* *

ప్రతిబింబితప్రాంతభర్మకదళీతరు
కాండనిర్మితరాజగంభీరవాహిని
పదమున, భద్రముగఁ బంకరుహములమీఁద 1210-1212

ఇట్టి సమాసమాలిక లనేకము లిందు వాసించుచున్నవి.

అచ్చతెనుఁగునుడికారము

నిసిగిసి నీనీట నీటిరములయందు
సచ్చంపుమగతాల నాసీనలై నెరల్
చిక్కుఁదీయుచుఁ జూపుఁజిలుకులు కలిపెడు
పాఁపకన్నెలయాటపాటలే యానగాఁ

* *

బసవంపుసెజ్జ విడి భారతీ! లే లెమ్ము. 1191-1197

* *

మునిఁగితేలుటకుఁగా నుండంజ మనది
పూలు సింగారించి పూసి గంపంబు
కలుముంత పట్టించి గంతు లేయుదము

పదవాక్యమాధుర్యము

ఈగ్రంథమునం దచ్చటచ్చటఁ గొన్నికొన్ని వాక్యములు కడుంగడుమృదుమధురభణితిలో వ్రాయఁబడినవి. వానియం దలరారుచున్న పదములపొందిక ముద్దులొలుకుచున్నది. ప్రాయికముగ నంతటనుంగూడ నిరతిశయమోదావహము లగువింతవింతమాటలు దేశ్యములు విచ్చలవిడిగ

వెదఁజల్లింపఁబడి సొంపులనింపుల నింపుచున్నవి. అట్టిపదములలోఁ గొన్నింటి నిందుదాహరించెదను.

పసుపుపైఁడులు - చిరునవ్వులు - కన్నులోయలు - పరువపుఁ బూలు - కరిగిపోటనీరు - నాగమీసాలు - ప్రేమాఘ్రుళు - సూపుడు చుక్కలు - అరగన్నపస్తు - ప్రేతాకటము - ఆత్మరుబట్టి ......

### ఉపసంహృతి

మొత్తముమీఁద గ్రంథము మిక్కిలిరసవంతమై, ధారాళమై, సహజగమనశోభితమై, సలక్షణమై శ్రుతి కింపు గూర్చుచున్నది.ఎంతచదివినను జదివినకొలఁది రసము చిప్పిలుచున్నది. ఆంగ్లభాషయందు నిరతిశయకీర్తిని గడించిన మిల్టన్ కవిశేఖరుని వాక్సుధామాధురికి సరితూగునట్టిచక్కని శైలిలో వ్రాయఁబడియున్నది. గ్రంథము పరిశీలించువారి కనువాదమనిపించక స్వతంత్రరచనవలెఁ గనుపట్టుచున్నది. ఇట్టిగ్రంథము రచించి మిల్టనుకవియొక్క కవితాసుధారసమును జవిచూడఁగలభాగ్యము నాంధ్రలోకమున కిచ్చిన శ్రీ విశ్వనాథ శాస్త్రిగారెంతయు వందనీయులు.

### కవిదీవనలు

(సంస్కృతము)

ఉ. ఈదృశపాండితీబలసమేతమహాకవితాకళాసము
త్పాదితమాధురీలలితపావనభావనవీనకల్పనా
హ్లాదరసప్రసారసవిలాసప్రబంధనిబంధనైకస
మ్మోద మొసంగి శంకరుఁడమోఘదయన్ మిముఁబ్రోచుఁ
[గావుతన్.

(అచ్చతెలుఁగు)

ఉ. చల్లనిసన్నజాజులపసందులఁ జిందుచు, నంద చందముల్
గొల్లగ గుప్పుచున్, జవులఁగూర్చెడిపల్కుల నొల్కుచున్, జగం
బెల్లెడ నిండుకీర్తి గడించుటకై పరభాసకబ్బముల్
మెల్లగఁ దెల్గుసేయుకలిమిన్ సిరిపెన్మిటి మీకొసంగుతన్!

గ్రం థా శీ స్సు లు

(సంస్కృతము)

శా. జ్యోతీరాగవినూతనాంశుకలసచ్ఛూతాంకురాస్వాదసం
జాతామందకపాయకంఠకలకంఠాలాపలీలాపథో
ద్భూతాఖండరసానుభావరుచిరామోదానుసంధాయక
ఖ్యాతింగామవిలాసకావ్యము జగత్కల్యాణమున్గూర్చుతన్!

(భాషాసమకములు)

సీ. సారసారస్వతాపారవాగ్ధోరణీ
వితతవిద్వన్మనఃప్రీతి, రీతి
వెలువుఁబోఁదోఁలి యబ్బురఁపుఁదెల్వని లోన
వెలిఁగించుకపురంపుఁ బలుకు, పలుకు
ధర్మసంస్థాపనార్థప్రసక్తప్రబో
ధనమాధురీరసాధార, ధార
కమ్మకస్తురిలేడికన్నెచెంగున దాఁటు
తటి గుమాయించునెత్తావి, తీవి

గీ. ఈద్భృగానందరససముత్పాదనాఢ్య
మయి జగంబులకున్ జోతియనఁగఁ బరఁగు

భవ్యకామవిలాససత్కావ్యయశము
సతముగా నిల్చి తెలుఁగుల సాకుఁగాక !

ఉ. విలసితమాలతీసుమనవీనపరీమళసారపూరమై
తెలుఁగులు తేటలుం దనిపి తీపుల జొంపెడిజుంటి తేనెయై
కలితసుధారసోపమితకామవిలాసకవిత్వ మీధరన్
గలువమగండుఁజుక్కలునుగల్గినదాఁక వెలుంగుఁగావుతన్ !

సీ. భాషాసతీహస్తపద్మసీధువులకై
గుదిగొనుగండుతుమ్మెదలరొదలో
నవ్యకావ్యవిలాసనారీమణీనాట్య
మందునఁ జిటిలిన గందవొడులో
భవజటాజూటసంభవనాకవాహినిన్
బొరలెడితరగతుంపురులపసలో
ఘననందనోద్యానవనకోకిలాంగనల్
చేరినపాటకచ్చేరిహాయలో

గీ. యనఁగ మాధురీసాధురీతిని వహించి
చదువరులడెందమున హాయిఁ గుదురుపఱచి
విశ్వనాథరచితకావ్యవిమలఫణితి
దెసలు మసలఁ గీరితిఁ దీర్చి దిద్దుఁగాత !

(అచ్చ తెలుఁగు)

ఉ. చల్లనిమల్లెపూల నెకసక్కెములాడెడినీటుఁ జూపి మా
యుల్లముఝల్లిగొల్పుచవు లుబ్బెడుకబ్బమునబ్బురంబుగన్
దొల్లిటిపల్కుఁదేనియలతో సరితూఁగెడికైతఁ బూన్చి మీ
రల్లితి రియ్యదే దెసల నల్లుచు నిండుయసంబుఁగాంచుతన్.

Kam'vilasam is sure so fine
That moon grows pale unfit to shine
With equal grace and hence perchance
Pours down on earth her milky glance.

The lulling fragrance of the rose
Mingl'd with skylark's melody close
Filtered into a song refined
Kam'vilasam is then defined.

ఇట్లు
విన్నవించు బుధవిధేయుఁడు,
అచ్యుతుని వేంకటాచలపతిరావు.

గుంటూరు,
20-3-'35.



# DEDICATED
TO
# VIRTUE



మాత యనుజాత కూఁతు నా మానినీమ
తల్లికల నెల్లఁ దలఁచెడుధర్మమతికిఁ
బరులఁ దండ్రి భ్రాత సుతులవలెఁ దలంచు
నతివ కిద్దాని నిత్తు నే నంకితముగ.



# ఇందలి పాత్రలు.

ఆనందపురాధిపతి జ్ఞానేశ్వరుఁడు
కుమారులు శమదములు
కుమార్తె సత్య లేక సతి
కాముఁడు వాని పరివారము
ధర్మదేవత
కొందఱు గొల్లలు

శ్రీమత్పరదేవతాయై నమః

# కామవిలాసము



శ్రీకరం బగుబ్రహ్మసృష్టితత్త్వంబు
వేదశాస్త్రంబుల వేదాంతవీథి
నగణితపురాణేతిహాసములయందు
ఋషులు తత్తుల్యులౌ కృతికర్త లమల
గంభీరవాక్కులఁ గావ్యములఁ దఱచు
శాసించి సూత్రముల సంతరించినను
దేశకాలంబుల దిద్దుపా టంది
ధర్మసూక్ష్మపుగతులు తాఱుమాఱగుటఁ
గాలగతి కనుగుణము కవిగణము గాంచి
పునరుక్తి నాఁబోక పుణ్యగతు లిచ్చు.

సత్యసూక్తులు కథల సరళముగఁ దెలియ
వ్రాసి యిడుచుందు రదె భవజలధితరణి
నైతికమార్గంబె న్యాయ్యమని తెల్ప
నియమవంతులె గాంత్రు నిండుసుఖ మంచు

సాధు లాపద ముట్టఁ జకితులై యుండ
దైవమే దిక్కగును ధర్మమే తుదకు
జయమందునని చూపు సరసచరితంబు
నూత్నవస్తు వటంచు నుడిఁ దొల్తఁ దెల్పి
లలితకలావేత్తల కభినుతి సేసి
హాయిఁ గాంచినబుధునిభావంబు మెచ్చి
రంగమున వెలిపుత్తు రసికు లెఱుఁగంగ.

*

కలదుగా లోకమునఁ గంటకప్రతతి
రాచబాటలఁ దిరుగురమణుల నొంప
బాధించుదుర్జాతిఁ బ్రభుఁడై శిక్షించు
ధర్మమే రూపంబుఁ దాల్చి భూస్థలిని
విధికృత్యమున కైనవేషంబు వేసి
కన్పడక వెన్దవిలి కాపాడుచుండు.

ధర్మదేవత యదే తరలి మునిమాపు
పనిఁబూని వేవేగ స్వర్గముఁ బీడి
ధరణిఁ బాదముపెట్టి తనలోనఁ దాను
జర్చింప మొదలిడినసరణి వినవయ్యె
సామాతపల్కుల నాలింపుఁ డీరు.

[ స్వర్గమునుండి భువికి దిగివచ్చుచు ]

ప్రవేశము - ధర్మదేవత

(తనలో)

స్వర్గమర్త్యములకుఁ జాలయంతరము
గన్పట్టుఁ దృష్టిలోనఁ గన్మాసి తెలివ
శ్రీలకు సారమై చెలఁగుస్వర్గంబు
తేజోవిరాజితదివ్యధామంబు
భూరిమనోగతిఁ బోయెదువారు
మృత్యుముఖంబున మిడుకనివారు
దుర్గతి నెన్నఁడుఁ దూలనివారు
పూర్ణసుధాంబుధి మున్గెడువారు
జవ్వన ముడుగనిజన మట నుండు
జలదంబు లలమనిచదద లచట మెఱయుఁ
జుక్కలనగళులు చూడ్కులఁ దనుపు
మించులకాంతుల మిన్నలరారు
మారుతం బొలయును మందమందముగ
సుమరాజినెత్తావి చొక్కించు మనము
నందనోద్యానమున నాకవాసులకుఁ
గల్పభూజంబులు గల్పించు సతము
ధరియింప వసనంబుఁ దాల్ప భూషలును

రసయుక్త మన్నంబు రసన కింపైన
పరిపక్వఫలరాజి వలచుపూఁదేన.

బహుభోగముల నిల్లు స్వర్గంబు వరల
ధూమంబువలెఁ గప్పు దురితసంతతులు
తిమిరసంకుచితంబు తిలయంతభూమి
కలవిప్పనేత్రముల్ గానంగలేవు
కరణంబు లున్నవి గావు పనిఁబూన
మృత్యువు వెన్నంటి మెఱుకుఁ బ్రాణంబు
దుఃఖముల్ బలిమిమైఁ దూలించు జనుల
సుఖ మన్నమాటయే సుంత లేదామె
జననమరణంబులే జపమంత్ర మామె
నజ్ఞానతిమిరంబు లలమె నంతటను
దుర్వాయుదూషితదుర్గంధతలము
కర్మబీజం బిలఁ గల్పించు నెపుడు
జీర్ణమౌ వసనంబు చిత్తవిభ్రాంతి
కృత్రిమభూషణాల్ ధృతి లేనిబ్రదుకు
చవిలేనియన్నం బసారసంసృతియుఁ
సీమంటిపెల్లకై యిల నజ్ఞుఁ డగుచు
దుర్మార్గగామియై తుళ్ళి దా నరుఁడు
నీచాశ్రయంబున నిజబంధనంబు

సత్త్వదూరుం డౌచు సకలకష్టములు
పనిఁబూని సమకూర్చు స్వర్గముం గనఁడు.

మన్నిట్లు దుష్పంకమగ్నమై యున్న
నిచ్చోటనే యుండు నెక్కడే నొకఁడు
ధర్మమే వర్మమై ధైర్య మిడి కావ
సత్త్వంబె సారమై సాయ మీఁ గాంచ
శుద్ధవిజ్ఞానంబె శోభనం బిడఁగ
శుష్కవివాదంబు శూన్యమై తలఁగ
జ్ఞానభాస్కరదీప్తి స్వర్గంపుఁబథము
ముదముతో వెల్గింప మున్ముందు సాగి
ధర్మమే స్వర్గంపుఁదాళముఁ దీయఁ
దనచేతిచెవి యగుచుఁ దలఁగ బంధములు ;

అటువంటిధర్మాత్ముఁ డాపదల్ పడక
వెన్నంటుదుర్జాతివితతిఁ దూలించి
చద లంటుకామాదిశలభజాలమును
జ్ఞానాగ్ని కీలమున శమియింపఁజేసి
విభునియాస్థానంబు వినయమునఁ జేర్ప
వలెనన్న కార్యంపుభరము నాపాలు
ప్రభుత వెట్టినయాజ్ఞఁ బాలింపవలదె ?

కాకున్ననీపాపగర్తమున కేల
నే వత్తు దివి వీడి నిత్యంబు నిటకు ?

నేఁ డొక్కకార్యంబు నెఱవేర్ప వలయు
నీదుర్గమారణ్య మే దరియఁజూచు
కారణం బది యేమొ కలయఁ దెల్పెదను.

జ్ఞానేశ్వరునిబిడ్డ సత్య యన్ సాధ్వి
యనుజులు శమదము లనుసరింపంగ
విద్యాగురునిఁ జేరి వీడ్కోల్పు వడసి
జనకుసంస్థానేశుశారదోత్సవము
గాంచఁగాఁ జనెడు నీగహనమార్గమున.

ఈవనిఁ బడిపోవునేవానికేని
దెరువు గానఁగరాదు దిక్కు లేర్పడవు
తరణికిరకాంతులు తబ్బిబ్బు లగును
కాఱుకన్బొమ వొల్చు ఘనతరుఛ్ఛాత
శివము జంకించు నిశిఁ బథముఁ గనక
తిరుగాడుపాంథులధీరతల్ సెడఁగ
లేఁతవయసున వారిలీలాంకురములఁ
గష్టముల కెఱ గాక కని కావవలయుఁ
గలరూపు దెల్పెదఁ గనని వినవట్టి

గాథల గీతములఁ గవు లెన్నసట్టి
చరితంబు చిత్రింతుఁ జవు లూఱ వినుఁడు.-

మదుఁడు సాఁబడెడునున్మత్తమానసుఁడు
మాత్సర్యయుతుఁడు దుర్మతి లోభివాఁడు
క్రోధతామ్రాక్షుండు క్రూరకర్ముండు
మోహవిభ్రాంతుండు మొఱకురక్కసుఁడు
ద్రాక్షపండ్లరసంబుఁ దా నాదిఁ గనెను
తాఁ ద్రాగి తనసతినిఁ ద్రాగించినాఁడు
సతిగాదు మారెమ్మ సజ్జనులఁ గలఁచు
నిల్లాలిచేఁబడ్డయి ల్లెల్ల మాఁపు
నువిద యిచ్చినదావ మొడలెల్ల గుల్ల
నరులెల్లఁ బశువులై నతిఁజేతు రంత ;

అయ్యొ దోకపాలైన నమ్మనేఁజంపి
పుట్టినకొడుకంచు భువిఁ బేరుఁగాంచి
కాముఁడని పిలువంగఁ గాంచె దుర్యశము
మోహాదిగుణపుంజములపుట్టినిల్లు
మంత్రిమాహాత్మ్యంపుమహితాలయంబు
మందులఁ జేఁబూని మాయలాఁ డుండె
దారి తప్పినయట్టి ధైర్యసాగరుల

గహనసీమలఁ జొచ్చు గంభీరమతుల
సాంద్రితమోహమగ్న సజ్జనోత్తముల
దప్పికై తారాడు తారుణ్యవతుల
దారికై పాఱాడు తరుణీజనంబు
మంచిమాటలు చెప్పి మనసు కరఁగించి
మర్యాదఁ బాటించి మార్దవముఁ జూపి
యాతిథ్యమున నెక్కుడాదరముఁ దెల్పి
హృదయ మాకర్షించి హింసలకుఁ గడఁగు.

తనచేతి కల్లింత త్రావించినపుడు
నరరూపు మాఱకే నరుఁడు గాకుండఁ
బశుశిరము గల్గునరపశువుగా మార్చు
నతులద్విపాత్పశు వనెడు నామంబు
బిరుదుగాఁ దగిలించి పెంచుఁ గుక్కలుగఁ
జూచుటకు నరులైనఁ జొప్పు పశువులదె
విషపానమత్తులై విషయగర్తమున
సుఖమున్న దనితలఁచు శుద్ధపశుసములు
కన్నవారల మఱచి కాంతల న్బాసి
బంధుభావము మాలి పందులై యుంద్రు;

ఈనరపిశాచ మొం డీయడవి నుండు

వానిహస్తమునుండి బాల ననుజులను
గాపాడవలె నంచు ఘనుఁడు స న్నంచె.

(చకితయై)

అనుచరులు గూడిరా నాడంబరముగఁ
గాముఁ డీవనములోఁ గాలూన నోపు ;
ఇది యేమివాయు విటు లింపుఁ గోల్పోయె
దుర్గంధమయ మయ్యె దుర్మార్గుఁ డిటుల
మార్గంబు నరికట్ట మసలఁగా నోపు.

నావేషమును మార్చి నాదీప్తి యడఁచి
గొల్లబోయఁడ నగుచు గుప్తముగ నిచట
భూరుహాగ్రిమమునఁ బొంచి నే నుండి
కాముువిలాసంబు కనులఁ గాంచెదను ;

అపరిమత్తత నుండి యనువైనవేళ
శ్రితి మించి పోసీక ప్రోతుఁ గన్యకను.

(అదృశ్యురాలగును) (గమకము)

కానలో దూరానఁ గలకలము వినవచ్చె.
చలపట్టె రేయిరులు సహాచరులు క్రోధుండు
లోభుండు మోహుండు లుప్తవిజ్ఞానియును

బలసికొలువఁగ వనము ప్రతివచన మీయంగఁ
బెడబొబ్బ లడరంగఁ బ్రీతిగాఁ గాముండు
పానపాత్రియు వలపుబాణంబు నిరుగేల
ధరియించి తూలుచుఁ దర్బారు సాగించెఁ
దనవారితో నిట్లు దర్పంబులను గొట్టె.

కాముఁడు :—

కాపరి రేచుక్కఁ గాంచి తనమంద
వేవేగఁ దోలుచు విడిచెఁ గాననము
దిననాథు కనకంపు దివ్యరథ మంతఁ
గడఁజేరి దిగఁ జారెఁ గడలిలో నిపుడు
వ్రాలుసూర్యునికరపాళికాకాంతి
యూర్ధ్వప్రసారమున నుడువీథిమబ్బు
టంచుల కెగఁబ్రాఁకి యలముకొనఁదొడఁగె.

కనుమొఱఁగి యినుఁ డిపుడు కడలికడ మీఱి
పూర్వదిశాప్రాంతభువిఁ జేర నేగె
మురిసి దిక్కాంతతో ముద్దాడఁబోయె
మన కిద్ది మంచిసమయ మగును గాదె
ఆడుటకుఁ బాడుటకు నానందవార్ధి
మునిఁగి తేలుటకుఁగా ముందంజ మనది

పూలు సింగారించి పూసి గంధంబు
కలుముంత పట్టించి గంతులేయుదము
బుధుఁడును దాంతుండుఁ బుణ్యవ్రతుండు
ననుభవజ్ఞానేంద్రుఁ డతివృద్ధతపసి
నిదురకు లోనైరి నిర్వీర్యులైరి ;
ఉన్నతకులములో నుద్భవము మనది
ఉన్నతదీప్తులయుద్ది గాంచుదము
తారలు రేరాజు తారుణ్యధనులు
గగనాంబురాశిలో ఘనకలితతరణి
నుత్సాహమున నెక్కి యుచ్చైస్స్వనంపు
గానముల్ మధురంబుగాఁ బాడి రదిగో !
ఆడుచున్నవి జలధు లాగానగతికి
దేవకన్యక లిసుకతిన్నెలం గూడి
పవడంపుఁదీవలను బసరుముత్తెముల
విరఁజిమ్మి యెగఁబోసి వింతగా నాడె.
వనకన్య లందందఁ బర్వు లిడుచుండి
విరివిగా సెలయేళ్లు వెనుదవిలి పాడె
పిల్లతెమ్మెర లోలసి విలిచె ముద్దులను
చందురుం డది కాంచి సరసముగ నగియె
వినఁగాంచి కుజరాజి విరియ నవ్వినది

పుష్పవతి లతకూన పూని తలయూఁచె
కందర్పార్భటుల గిరి గద్దించి పలికె.
ఆటపాటల నందఱటు గలిసి మెలసి
నిసి గడుప మన కిపుడు నిదుర పనియేమి?
ఆనందమునుగూర్చి హాయి యనిపించె
మోహాలందు మేల్కాంచె ముగిసె మోహాంబు
రససాంద్రకేళిలో రండు పాల్గొనుఁడు
పగటికాంతులలోనఁ బండుపాపములు
తమము పాపపుమాటఁ దలపెట్టఁబోదు
జోహారు మాయమ్మ! జూదరులతల్లి!
తిమిరంపుఁదెరలోన దివిటీలముందు
మోముఁజూపవె మారి మోడిగలముగుద!
కాలరాత్రియ గన్నకందు తాఁ బెఱిగి
వాయుగోళం బంత వ్యాపించి యొకట
నాడఁ బిలుచుచున్న దతివ మి మ్మిపుడు
కాంతమై నీలమై ఘనసామ్యమైన
నీదువిహాసంబు నిలఁబెట్టు మమ్మ!
మాయలు మంత్రాలు మనసిచ్చి కొలువ
సతతంబు నీకార్యసాధనకుఁ బూను
సరసుల మముఁ గాంచు సఖ్యంబు నెఱపు

నీయానల స్నేమము నెఱవేర్చువిధము
గాంచి యానందింపఁ గానలో నిలుమ!
ఒక్కటే న్దిగవిడువ కోర్చి పనిసేతు
మీకేయి వేగకే యింతిరో వినుమ.
ముగుద యుషాకన్య పులకించి లేచి
సద్దైసల్ తెలుపాఱ సమ్మోకము గాంచి
నిశ మూదువృత్తంబు నిరయమ్మై తోఁపఁ
గొండెముల్ రవితోడఁ గూర్చులోపలనె
నీయానలను మేము నెఱవేర్తుమమ్మ!
రండోయి సఖులార! రంగతల మిదియె
గుడికట్టి చెయిచఱచి కుప్పించి దుమికి
తేలియాడఁగ రండు తిరిగి యాస్థలిని.
ఆశ్చర్యచకితుఁడై యాటాడ మాని
మెలఁతపొలుపునుబట్టి మిత్రులం జూచి
కార్యసాధనఁ గోరి కాముఁ డిట్లనియె.

**కాముఁడు :—**

(తనవారితో) (గమకి ము.)

ఓ పొండు వేవేగఁ బొదలమాటున కిపుడె
యాస్థలప్రాంతముల నెక్కడో వినవచ్చె
తప్పటడుగులజాడ దారి తప్పినయొక్క

యభిమానవతి కన్నె యనిపించు నాప్రజ్ఞ
పదిమంది మన మున్న భయమందఁగా నోవుఁ
బో పొందు వేవేగఁ బొదలమాటున కిపుడె.

(తవలో॰)

ఆజ్ఞ విని సఖులెల్ల రటు మాయమైరి
కత్తెరబోనుగాఁ గాంచ నాగృహము
నారంగు నాహొయలు నామంత్రమహిమ
నావిలాసం బంత నమ్మఁగాఁ జనుఁడు
మాయమ్మ మారెమ్మ మందలో నుండు
పశుకోటి నేమించి పాలింతు నేను
మాయమంత్రం బింత మాయింపనేని
తూలమటు వాయువునఁ దూలింపనేని
వెలయించి కనుకట్టు విభ్రాంతిఁ గొల్పి
తాఱుమాఱుగఁ జేసి తంత్రంబు పన్ని
దర్పంబు విడనాడి దయఁజూపనేని
బీద సంసారి యనువిశ్వాస మొదవఁ
దీపు లొల్కెడుపల్కు తేనె లందిచ్చి
మానరక్షకు నట్లు మర్యాద విడక
వర్తించి హృదయంబు వశముఁగొననేని
అభిమానవతి కన్నె యనుమాన మందు

వలఁబడ్డ మత్స్యంబు వలదు విడువంగ
నిదె యిటుల రానయ్యె నీకన్నమిన్న
పొడసూపకే కాంతుఁ బాలఁతియంతరము.

### ప్రవేశము - పత్ని

(తనలో)

వినవచ్చెఁ గలికలము విపినాంతరమున
శ్రుతి నమ్మఁ దగినట్టి శుభమార్గదర్శి
మధుపానమత్తులై మర్యాద విడిచి
విషయసుఖముల కెపుడుఁ బ్రియశిష్యు లగుచుఁ
జోరులై జారులై జూదములె పనిగ
రాత్రులం దిరుగాడు రక్కసుల మూఁక
ప్రతిభాష లనితోఁచుఁ బరికించి చూడ.
ఖలులు గూడినచోటఁ గా లూన రాదు
మానభంగము సేసి మర్యాద యనును
సాధులఁ బీడించి సరసమది యనును
కానిమ్ము చూడవలె గతి లేని యపుడు
దిక్కులే దనరాదు దేవుఁడే దిక్కు
సాహసంబున లక్ష్మి సమకూరుఁగాదె
శీలంబె సాధ్వికి శితఖడ్గ ధార

చేరవలె జూదరులఁ జేతఁగొని యుక్తి
దారియేర్పడ గృహముఁ దఱియఁగా వలయు.
నాయనుఁగుసోదరులు న న్నిచట విడిచి
యాయాస మనఁబోక యతిప్రీతిఁ గదలి
యీతరుచ్ఛాయల నీరేయి గడుపఁ
గా నెంచి వనలక్ష్మి కారుణ్యబుద్ధి
నిడురుచిరఫలరాజి నెటులో కొనివచ్చుఁ
బనిఁబూని యాకుంజపాళిలోఁ జొచ్చి
జాగయ్యె రాలేదు సంధ్య మీఱినది.

ఏలతమ్ములు తడసి రెచట నున్నార
లీచింత హృదయంబు నేర్చఁగాఁ దొడఁగె.
కాంతారసీమలోఁ గడుదూర మేగఁ
దిమిర మంతటఁ బ్రాఁకఁ దెన్ను లేర్పడక
తారాడుతమ్ములఁ దమము మ్రుచ్చిలెను
దొంగవే రజని! యోదోషంపుఁబ్రోవ!
దొంగవు కాకున్న దోసఁగుఁ దేఁజూతె
దొంగవు కాకున్న దూరమున మింట
వ్రేలాడి వెలుఁగిచ్చు విమలోడురాజిఁ
బలుమాఱు త్రైలంపుఁ బ్రాఁతిలేకుండ
దిక్కులు గనలేని తెరువరికిఁ బ్రీతి

దారిఁ జూపుచుఁ గ్రాలుధర్మమూర్తులను
నీగర్భమున డాఁప నీతియే నీకు ?
నిశ్చయం బిచ్చోట నే విన్నయట్టి
త్రాగుఁబోతుల హాస్యతంత్రంబు నడచె
నంతలో నేమాయె నాశ్చర్యమాయె
మటుమాయమైపోయె మానవునిజాడ.
ఏమి కానోపునో యేమి తోఁచ దికఁ
బలుపోకలై మనసు భ్రాంతిచేఁ గలఁగె
దయ్యాలు భూతాలు తలఁపులోఁ దోఁచె
నచ్చుగా వికటంపుటాకృతులు పిలిచె
వాయుజిహ్వాలయందుఁ బ్రేతభాష లెడలె
నెడఁదలో నెగఁబ్రాఁకె నీతీరు భ్రాంతి
యిసుమంతఁ గలఁచిన దేమంచు నగితి.
భూతాలు ప్రేతాలు భువి నెన్నొ పుట్టు
క్షణములో మనసులోఁ గన్పట్టు నుడుగు
సత్యశీలుర నెందు సంకల్పధనుల
నాత్మవిశ్వాసమున నతిధీరమతుల
భ్రాంతిఁ గొల్పఁగనోవు, భయపెట్టఁగలవె ?

స్వాగతం బమ్మ ! విశ్వాసమా ! రమ్మ !
నిష్కలుషమతి వంచు నీకనులు దెల్పు ;

ఆశాలతాతన్వి ! యతిపూతచరిత !
నాయండ విడిపోక నాతోడు కమ్మ !
బంగారుపసలీనుపక్షిద్వయంపు
దివ్యకామిని వమ్మ తెలియఁజాలుదును.
కన్దోయిఁ గన్పట్టెఁ గాంతరూపంబు
విశ్వాస మూనంగ వేవేలకనుల
విధితరణి దరిఁ జేర్చు విపదబ్ధి మునుఁగ
అవినీతు లెల్ల నా యాత్మకుబంట్లు
పాపాత్ము లాత్మీయబంధములు గోరి
చేతులారఁగఁ జేయుచెనఁటిచేష్టితపు
ఫలరూపమున మించి బాధించుఁగాని
పడఁతులశీలంబు పరువు మర్యాదఁ
గాపాడ నీకుండు కరుణతోఁ గాంతి
గల్గి భాసిలుదివ్యకామినిం బంప
దుర్మతుల్ సతిఁజేర దుష్కరము గాదె !
మోసపోయితినేమొ మోహమో యేమొ ?
మొయిలుచానలముద్దుమోముతళ్కేమొ ?
తరులయంతరమందుఁ దళ్కుమనిపించె
శుభసూచకం బిద్ది శోధింపవలయు.
కంఠోక్తిఁ బిలువంగఁ గాదు సోదరులఁ

గాన వైశద్యమునఁ గాంతారసీమ
కడముట్టఁ బ్రతిధ్వానఁ గల్పింపనగును.
యత్నంబు ఫలియించు నంచు నుత్సాహ
ముదయించి ప్రోద్బలం బొడవించె లోన
నాతమ్ము లిందింద నడయాడనోవు.
చల్లగా గాలిలో సందేశ మట్లు
శ్రుతిపుటి గానంబు సొచ్చినంతటనె
శబ్దాధిదేవత చాయనే వచ్చి
తమ్ములు ననుఁజేర దారి యేర్పడును.

(పాట)

విద్యుద్విమానాల విహరించుశారదా!
పవమానభవనాల వసియించుశారదా!
కంటికే రూపానఁ గనరానిశారదా!
గంగమలకల మలఁగుగానంపుశారదా!
చక్రాంగ మాత్మీయచరితంబు వావిడిచి
విలపించి వినిపింప వినుఘ్రాన కోదార్చి
వనులలోయలలోన వసియించుశారదా!
ముద్దుఁగొల్పెడువారి మోహనాకారులే
దుర్లభుఁడు నీప్రియుని దోపించువా రంచుఁ

బూలపొదరిండ్లలోఁ బొలఁతి డాఁచితివే మొ
న్యాయ్యమా తెల్పవే నా చిన్ని శారదా !
నినుఁ బ్రార్థనము సేతు నిశ్చలముగా నాదు
గానంపుఁ బ్రతిభావ కాననం బంతటఁ
వ్యాపింపఁగాఁ జేయవలె నమ్మ శారదా !

**కాముఁడు :—**

(తనలో)

దివ్య మున్మత్త మీాతీరుగానంబు
మనుజకాంతలలోన మహిఁ గానఁగలమె ?
మానుషాతీతమౌ మహిమ గన్పట్టుఁ
జోద్యముగ నాకసము శ్రుతి మేళవించి
వాయువునఁ బ్రతిభాష ప్రాభవముఁ జూపె
శాంతమౌ యామినిఁ జల్లగా లేచి
మది నిండు గాన మంబర మావరించె
గిరినిర్ఝరీకాంతగీతములు వింటి.
మాయమ్మ మంజులమదకలితగీత
ములు వినఁ గంటి వే మూర్ఛలో మ్ముంచి
యాత్మను బంధించి యనువు స్వస్థలికి
పూతమై హృద్యమై ముదముఁ జేకూర్చి
స్మృతిగల్గి శ్రావ్యమౌ మించుగీతంబు
లెచ్చటఁ వినఁ గాన నింతవఱ కేను,

పల్కరించెద నీవె వలయు నారాణి!
ఎవతెవమ్మా! యిట్టు లీఘోరవిపిన
సీమకు రానేల? చెప్పఁగదవమ్మ!
వనదేవతవా యేమొ వనము పుష్పించి
యామోద మొలయంగ నతివ పాడితివి.

సత్య. దేవతను గానోయి తెలియు మోయయ్య
సరిగాదు నుతిసేయ సాదు గొల్లండ!
శ్రుతిఁ బెట్టఁదగ దద్ది త్రిప యడ్డుపడదె?
గానసామర్థ్యంబు గర్వించి చూప
నీరీతి పాడ లే దీకానఁ దమ్ముఁ
గుబ్బలఁ బెడఁబాసి కూడఁగాఁ దలఁచి
యర్థినై దివ్యశబ్దాధిదేవతను
బ్రార్థింపఁగా నింత పాడితిని సుమ్మ.

కామ. కాంతరో విడిపోవఁ గారణం బేమి?

సత్య. దారి కొత్తది యిట్టి దట్టంపుటడవి
సంధకారముఁ గ్రమ్మ నడుగఁగావలెనె?

కా. తోడ నడచెడువారు దూర మెట్లయిరి?

స. చనిరి పసిరికబీట శ్రమవాయ విడిచి.

కా. మూర్ఖులో! క్రౌర్యమో! మోసగించుటయో!

స. వలియూట నీరుఁ దే వడి నేగిరోయి.
కా. ముగుద వగునిను వీడి పోఁగల్గి రెట్లు ?
స. రాజిల్లు కవలోయి ! రమణీయతనులు
త్వరలోనఁ దిరిగి రా భావించి చనిరి.
కా. అంధకారము లలమి యడ్డఁగా నోవు.
స. ఎంతలో దురదృష్ట మిటు నన్ను ముట్టె !
కా. నీశ్రమ దగఁజాల నిలిచి బాధింపఁ
దమ్ములకై చింతఁ దపియింతువేమొ.
స. అనుజులజాడకే యతిదుఃఖ మొదవె.
కా. కౌమారధుర్యులో ! కలితయౌవనులో !
స. నూనూగుమీసాలనూత్న యౌవనులె.
కా. పగలెల్లఁ బొలములోఁ బాటుపడి యెద్దు
కా ల్లీడ్చుకొని యింటికై వచ్చువేళఁ
గూటికై కర్షకుఁడు కూర్చున్న వేళఁ
గంటినే కవలను గనువిందుగాను.
ఆచిన్నిమలచెంత నతిమధుదాత్రి
పందిట నడయాడుపడుచువారలను
బండుగుత్తులఁ గోయుభాగ్యశాలురను
గనులారఁ గంటినే కాంతరో ! నేను
సుందరాకారులే సుర లంచుఁ దలఁతు

దట్టంపు మొయిళు లందంపుహరిధనువు
లాటపట్టయినట్టి యానందధనులు
దృక్పథంబునఁ బడ్డత్రుటిలోనవారి
నర్చింప మనసాయె నాశ్చర్యమాయె.

వనితరో! నీవారు వారలే తైన
నీకు సాయముఁ జేయ నీవెంట రాక
సమధికసుఖదంపుస్వర్గ మని తలఁతు.

స. మంచిమాటాడితివి మాయన్న ! నీవు
వేగ నే నటఁ జేరు విధ మింత తెల్పు.

కా. ఆచో టిటకుఁ బశ్చిమాశగాఁ గలదు.

స. అంతమాత్రాన కోయన్న ! యచ్చోటు
నీయుడుకాంతిలో నీకాఱుటడవి
దారి తెలిసినవారె తబ్బిబ్బు వడఁగ
ధైర్య ముండిన నేమి తగినసాయంబుఁ
గాంచ కేఁ జేరంగఁ గష్టమని తోఁచు.

కా. సందు లేఁ గాంచనివి చానరో! లేవు
విహరింపనిబయళ్లు వెలఁదిరో! లేవు
సెలయేటితీరాలఁ జిఱుదుబ్బులందు
గడ్డులోయలయందుఁ గవులఁ బొదరిండ్లఁ
గోరి తిరుగనిచోట్లు కొమ్మరో! సున్న

ప్రతిదినంబును దిరుగుచోటలే పడఁతి !
తాతముత్తాతల తావులే తరుణి !
నీతమ్ము లీకోస నెలవుకొనియున్న
హద్దు దాటక యుండె యాయువకు లున్నఁ
దెల్లవారెడులోనఁ దెలియఁ జాలుదుము.
గూండ్లఁ గాకులు లేచి కూయుటకు మున్నె
యనుజన్ములను గాంచనగును మన కబల !
ఇంతి ! మన మదృష్టహీనులమె యైనఁ
గనిపట్టి నీవారిఁ గాంచునందనుక
నమ్మిక నాతోడ నాపూరియింట
సుఖజీవనం బిత్తు సుదతిరో ! రమ్ము.

స. సజ్జనుఁడ ! నీవల్కు సత్యమని తలఁతు
నిండునమ్మికతోడ నియతి గన్పట్టె
విశ్వాస మనువిమలవిఖ్యాతధనము
రాజహర్మ్యములందు రచ్చకొట్టముల
దివ్యసౌధములందు దీపించు ననుట
నమ్మ లే మది నటన న్యాయ మట సున్న
గగనకుసుమముఁ దెల్లకాకినే గనుట
శశవిషాణముఁ దివిరి సాధించినట్లు
పొగచూరుపూరిండ్లఁ బూరి బీదలిండ్లఁ

దలఁగక నియతమై ధర్మమై నిలుచు.

(తనలో)

ఈసాధుసాచివ్య మేఁ గోసఁగఁగలయు
నింతకన్నను రక్ష యేడ నేఁ గాంతు ?
దేవ! న న్నొకకంటఁ దేరికొనఁ జూడు
నాకల్మి యత్నంబు నాపాటి గనుము.

(ప్రకాశము)

చనుమయ్య మున్ముందు చనుదెంతు వెంట.

(ఇరువురు నిష్క్రమింతురు.)

2. ప్రవేశము - అన్నదమ్ములు - కవలు.
(వని మఱియొకమూల)

అన్న:- తారకామణులార! తలఁగరే తెరను.
చందురుఁడ! నీమోము చవి యింత చూపు
దారిఁ బోయెడువారు దరిఁ జేరి యిచ్చు
నాశీస్సు లతిప్రీతి నందుదురుగాదె!
నీరదమాలలో నీటుగా మోము
తొలకరి మెఱుపువలెఁ దులకింపరాదె !
అంధకారము గూడి యగపాళిసీడ

లలమఁగా నతితీవ్రమై రేయి యడరె.
రాజు లేకున్నట్టిరాష్ట్రమై తోఁచె.

అధికారమును జూపి యాదరం బిడుచు.
మీబలం బీయిరుల మీరలేకున్న
నేపూరిగుడిసెలో నేమూలనైనఁ
గ్రాలుచుఁ జోద్యమా కాష్ఠంపు దివ్వె
మా కింతసాయమై మార్గంబుఁ జూప
నదియె చూపుడుచుక్క యగుఁగాదె మాకు !

తమ్ముఁడు:- కన్నుఁగవ కింతసౌఖ్యంబు లేకున్న
గొఱియమందలసడి కూడదే శ్రుతికి
వేణునాదంబైన విన్పింపఁదగదె ?
గొల్లనియీలైన గుర్తింపఁగాదె
నిసికోడికూఁతైన నిలుపఁగ రాదె
యించుక ధైర్యంబు నింతయుత్సాహ
మిదునంధకూపమున నీముండ్లపొదల ;
ఆదురదృష్టవతి యక్కగతి యేమొ
యెచ్చోటి కేగెనో యెటుఁ గాంచఁగలమొ ?
చలి హెచ్చె ముల్పొదలు చాలఁగాఁ దనరు
నేయేటివలితీర మింతి చేరినదొ

తరుమూలమునం జేరి తల దాఁచుకొనెనొ ?
కటకుమోదులపైనఁ గదిసెనో శిరము
భయకంపితాంగియై పడియుండె నేమొ
కాఱడవి దృశ్యములఁ గంపించె నేమొ ?
క్రూరమృగములవాతఁ గూలెనో యేమొ ?

అన్న. శాంతించు తమ్ముఁడా ! శంక లిఁకఁ జాలు
నాపద లూహింప నగుఫలం బున్న ?
అది యట్లు యగుఁగాక యైన రాఁబోవు
దుఃఖంబు లూహించి దురపిల్ల నేల ?
కల్లనిజములు గనక కలవరం బేల ?
నీతలఁపు లన్నియు నిజము కాకున్న
నాత్మవంచన యగుచు నది వెగటు దోఁచు.

సోదరి నిటు లీవు చులకఁగాఁ దలఁతె ?
నియమబద్ధం బైన నిశ్చలం బైన
శాంతస్వభావంబు సాధించె సాధ్వి.
దీపంబు లేకున్న దిక్కేది యున్న
నంతమాత్రనకే యడలు పుట్టించి
శాంతభావముఁ గలఁచి చలియింపఁ జేసి
యనుచితస్థితి కీడ్చు ననుమాట కల్ల.

శీలమే వర్మమై చెలియ నటు గావ
నాపదలు ముట్టలే వని విశ్వసింతు.

చంద్రసూర్యులకాంతి జలధిలో నడఁగ
నంధకారము గ్రమ్మ యరికట్టఁబోవ
నాత్మప్రకాశంబె యాధార మగును.

ఏకాంతమును గోరు నెపుడుఁ దా జ్ఞాని
నల్వురు గలచోట నలఁగి చెడిపోవు ;
నిర్మలరవిదీప్తి నిండి మది నున్నఁ
బట్టపగ లనిపించు వరకాళరాత్రి ;
పాపి యగుచో మలినభావంబు లడరి
పగలె దోషము ముట్ట భ్రమఁజెంది తూలు ;
తనమనసె నరకమై తలకించు సతము ;

తమ్మ. సత్య మిది జ్ఞాని దా సాధనకుఁ దివిరి
యేకాంతమును గోరి యేకొండగుహనో
యాశ్రయించును దపం బతిప్రీతి సేయ ;
ఆకుటీరముఁ జొచ్చి యందు మెయి వాల్చి
హార్మ్యముల రాజువలె హాయిగా నుండు ;
సన్న్యాసి చీఁకులను సవరించు నెవఁడు ?
పొత్తముల్ పూసలు భోజనపుఁజిప్ప

లాశించి కాఁజేయునాచోరుఁ డెవఁడు ?
శతవృద్ధులం బట్టి సాధించు నెవఁడు ?
పెరటికల్పక మట్లు పెన్నిధి యటుల
నార ముగ్గినపండ్ల నఱవిప్పఁబూల
సంతరించిన హేమచారుకుజ మట్లు
పరులు ముట్టకయుండఁ బాడు కాకుండఁ
గడుమోటుచేతులఁ గందిపోకుండఁ
గనకాంగికిఁ వలయుఘనరక్షణంబు ;
తఱి వేచి యాపదల్ దలపించునందు\।

ఏకతమ తోఁబుట్టు నిట్టికాఱడవి 530
నాపదల్ చెనకకే యలఁతిఁగా విడుచు
ననుమాట లే నమ్మ నగరిజా ! వినుము ;
నాతి కేమగు నంచు నచ్చఁ జెప్పుటలు
లోభి దాఁచినపెట్టెలో నున్నధనము
దొంగవాఁకిటఁ బోసి దొసఁ గేమి యనుట ;
దీప మిడి గాలిలో దేవ ! నీమహిమ
యని మొక్కి నిలచినటు లగుఁగాదె యన్న !

ఒంటరి నిశ యంచు నులుకు లేదోయి
యాకాలమున డాయునాపదల్ మెండు

రక్షకుఁడు లేనట్టి రమణిదేహంబు
పాపులస్పర్శకై భయమందవలయు.

అన్న. సోదరీమణి సౌఖ్యశుభభావ గరిమ
నిర్వివాదం బంచు నిశ్చయం బంచు
భావింప నెందైన భయ మటులె యాశ
సమభావముగ నుండ సహజమా నాకు
నాశఁ జేకొని భయం బావలకుఁ ద్రోయ
మోదమున ననుమానమును విడిచిపుత్తు.
నీ తలఁచినటు లంత నిజరక్ష లేక
దీనవై సోదరి దిగులువడ దెపుడు.
కన్పడని బల మెంతో గల దామెచెంత
మఱచిపోయితి వేమొ మానవతి గాదె?

తమ్ము. బల మేమి? ఈశ్వరబల మన్నమాట.

అన్న. అగునయ్య యతిగూఢ మతులమా బలము
పరమేశుకృప యున్నఁ బడఁతి దనవచ్చు
శీలమే శక్తియగుఁ జింత మన కేల?
ఉపమింప శీలంబె యుక్కుకవచంబు
ధరియించి తన్వంగి ధన్వముగా దాల్చి
తూణీరమున వాఁడితూపులను నింపి

గర్వమునఁ దిరుగాడు గట్టురాపట్టి
వలె ఘోర కాంతార వాటులయందుఁ
జొరరాని పలుముండ్లచొప్పాలయందుఁ
జే రెత్తఁగూడని పెనుగొండలందుఁ
బ్రాణికంటక మైనబయళులం దెల్ల
స్వేచ్ఛగా సుఖముగా విహరించఁగలదు.
శీలభాస్కరదీప్తిఁ జెలియ చెలువొందఁ
గ్రూరుఁడు చోరుఁడు కోడెగాఁడైన
కన్నెమానసము కలుషకలితముగఁ జేయఁ
జాలఁడు; కన్నెత్తి చాయఁ గనలేఁడు.

ఇంతేల మరుభూమి మృత్యువాసముల
బెన్తలకోటుల భీకరాకార
ముల ఊతిగుహాలందు ముగుద ధైర్యమున
రాణివలె రేవగలు రాజ్యంబుసేయు
గరువ మనఁ గాదోయి కపట మనఁగాదు
ఏపాపమతిమైన నెప్పట్టునైన
మంచులో నగ్నిలో మడులపంకములఁ
బొడగట్టు భూతాలు పొరిఁదంత్రికత్తె
పొగరుఁ బట్టినయట్టి ఖోడిప్రేతములు
పాతాళగృహములఁ బైశాచవృత్తు

లెంతమాత్రముఁ గష్ట మిఁక జాలవయ్య
సాధుశీలముఁ గన్నసతి ముట్టవయ్య.

విశ్వసింపఁగ లేవె విను మెన్నొ పూర్వ
గాధలు నుతియించుఁగా శీలఘనత !
భిల్లభామిని రూపుఁ బ్రీతిగాఁ దాల్చి
కోదండమును దూపుగుమి చేతఁబట్టి
సింహేంద్రవాహిని చిచ్ఛక్తి యెపుడు
కాంతశీలముఁ గాచు ; ఖలుల శిక్షించు.
హృదయంబులో డాఁగి హెచ్చుబల మిచ్చుఁ;
జుటుకుఁజూపుల సత్తి చూడ భీతిల్లి
దుర్మతి సాధులకు దూరమున నిలుచు
వనములరాణియై పాలించు గౌరి.
సత్తి యిచ్చినశక్తి సాయమై యుండ
రక్తి సీతను బట్ట రావణాసురుని
ముల్లోకముల నేలుమూలబల మడఁగె
సానుజసుతుఁడుగాఁ జచ్చె యుద్ధమున.
నీచకిరాతుండు నీటుకాఁ డగుచు
దమయంతి చూపులో దగ్ధమై పోయె ;
కేసరికిసరియైన కీచకునిశక్తి
రమణిద్రౌపదిఁ బట్టి రాళ్ళపాలాయె.

సత్యవంతునిఁ గొంచు సమవర్తి యేగఁ
బొంద నొకచోఁ బెట్టి పొలఁతి సావిత్రి
భక్తియుక్తిని ధర్మవాదంబు సల్పి
యంతకుని మెప్పించి యందె వరములను
విభునితో సుఖముగా వెలఁది మనఁగాంచె

పశుబలం బిటు మంటిపా లౌను జుమ్ము
సత్యశీలముఁ గన్న సతి నెవఁడు ముట్టు ?
నింగలం బొడిఁగట్టి యెవఁడు నిదురించు ?
నిర్మలచరితంబె నిత్యునకుఁ బ్రీతి
ఆశ్చర్య మనిపించి యర్చించు జనము
స్థిరశీలవతిఁ గావఁ జెంతనే దివ్య
కాంతలు పదివేలు కనిపెట్టి యుంద్రు.
పాపములఁ గలఁచి తత్పాలనము గలఁ
బూతదృశ్యము లిచ్చి పోషించి మనసుఁ
బొంగునట్టులఁ జేయుఁ బుణ్యచరితలకు.

సజ్జనుం డీదివ్యచారిత్రకథలఁ
బఠియించి యుత్తేజభావంబు వడసి
నిత్యయుక్తినిఁ జేసి నిజము గనఁజాలి
పరమాత్మునుతిలేనిపదముఁ జేపట్టు ;

ఖలుల కసాధ్యంబుఁ గనలేరు పరులు
మోహాబ్ధిలోఁ జిక్కి మోసపోయెదరు ;
దుశ్చరిత్రంబులు దుస్తంత్రచలిత
దుర్మదవిక్షేప దోషంపురుచులు
కామవికారంపుఁ గల్మషంబంత
హృదయాంతరంగముల నేవుగాఁ జిమ్మ
నాత్మ నిస్తేజమై యంధమైపోవు
దేహవాసన పోదు దెసపశుచింత
దేవధామంబన్న దివ్యగుణశక్తి
మది విస్మరించును మలినంపుఁబ్రోవు
విషయగర్తము త్రవ్వి స్వీయనాశంబుఁ
గోరి దుర్మతి యందుఁ గూలి చెడిపోవు.

తమ్ము. పరతత్త్వభావంపుఁ బరిమళశ్రీలు
రసవార్ధిలో ముంచి రక్తి గట్టించె
వడి మూర్ఖుఁ డన్నట్లు పరుషంబు గాదు
భారతీమృదుగీతభాగ్యంబుఁ బోలు
అమృతమయభక్ష్యంపు టతులంపువిందు
నత్యంతముం గొన్న నధిక మనుమాట
లారాజ్యమున నెప్పు డనుట వినరాదు.

అన్న. (వినుట నభినయించి)

విను విను విందుగా వినఁబడె శ్రుతికి
పదపూతపాతంబు పవనంబుఁ గలఁచె.

తమ్ము. ఏ నల్లె తలఁచితి నేమి గానోవు ?

అన్న. ఎవ్వఁడేఁ గానోవు నీకానఁ దిరుగు
మనవలె దారి తొర్మార్గైనవాఁడు
కానదరి నివసించుకాఁపు గావచ్చు
దొంగయే కావచ్చు దోపిడికి వెడలె.

తమ్ము. ప్రభుఁడె సోదరి నిందు రక్షింపవలయు
సామీప్యవర్తియై సడి తోఁచెఁబడియె
ఖడ్గంబు చేఁబట్టు ! కాచుకోవలయు.

పల్కరించెద స్నేహపాత్రుండె యైన
సరిగూడి మనతోడఁ జనవుమెయి నుండు
కాకున్న స్త్రీయరక్షణ యన్న ధర్మ
కార్యమున నీశుఁడే గలఁడు మనపట్ల.

(ఇర్వురివాక్యము)

గొల్లవేసము నూని గూఢచరితమున
మెల్లగా మావెంట మీఱి రానేల
ఎవఁడవో మాటాడ కిటు రాకుమోయి
దరి రాకు మాఖడ్గధారలం బడుదు.

ధర్మ్మవు. కంత మెవ్వరిదానొ ? గాంచ యువరాజొ ?
పల్కు మింకొకసారి పాయు విభ్రాంతి.
తమ్మ. కానోవు మనతండ్రి కర్షకుం డితఁడు.
అన్న. కమ్మపిల్లనగ్రోవిఁ గలియునీగాన
కళ వినఁ బర్విడు కలికి సెలయేఱు
తుర్రి ళ్ళింతలోఁ గొంత తూఁగి దా నిలుచు ;
ప్రసవమాధుర్యంబు వర్ధిల్లఁ జేసె
నిట కీవు మిత్రుఁడా ! యేల వచ్చితివి ?
గొఱియ నొక్కటి మందఁ గోల్పోతివేమొ ?
చినిమేక నేతల్లి చేరనే లేదొ ?
వెలుఁగు పెనుగాలికే వెలిఁబడ్డదేమొ ?
ఈమాటుమూలలకు నేల వచ్చితివి ?
ధర్మ. యువరాజ ! లేఁడు నీ కుపమింప సముఁడు
ప్రభున కీవానందపాత్రుండ వయ్య
మాప్రాణమని నిన్ను మన్నింతుమయ్య
నాగొఱ్ఱె నామేక నా కున్నధనము
సర్వంబు పోయినఁ గాంతిఁ గోల్పోవ ;
నీకార్యభారమున కివి యేటిసాటి !
అగుఁగాని యీయమ్మ యతిపూతచరిత
కన్న విడిపోవంగఁ గారణం బేమి ?

అన్న. అతివిషాదముఁ గూర్చె నయ్య విన్పింతు
మాతప్పు లే దిందు మాప్రమాదంబు
గాదు! కోల్పోతి మీకాననంబందు
మాసోదరి న్నేము మార్గంబుఁ దప్పి.
ధర్మ. పోలునె విధి కిట్లు? పుణ్యహీనుండ!
నాభీతి నిజమాయె నాబాధ హెచ్చె.
అన్న. భయమందు వది యేమొ పల్కు శీఘ్రముగ.
ధర్మ. చెప్పెద వినుమయ్య చిత్త మీ విచ్చి,
దివ్యభారతిబోధ తెలియఁ గన్నట్టి
ఋషితుల్యు లౌకవుల్ కృతులందుఁ బల్కు-
భేతాళవట మన్నఁ బ్రేతంబు లన్న
నరకలోకం బన్న నమ్మకము లేక
యజ్ఞాని విశ్వాస మం దుంచకున్నఁ
గలవయ్య భూతముల్ కల్ల లనఁగాదు
నమ్మలేకుంట యంధత్వమును మించు.

సీవికృతారణ్యమే వాసగృహము
గాఁ గుజచ్ఛాయలఁ గనరాక డాఁగి
కాముండు నివసించి కడుఁ గ్రూరుఁ డగుచు
జనుల మోసముచేసి జయపతాకెత్తి
నింపైనవిషపాన మిచ్చి లోఁగొనును.

మనుజభావము వీడి మనఁ బశువులట్లు
పశుత మోహమునఁ దాండవము సేయ జనుఁడు
జడత రూపముఁ దాల్చుసరణిఁ జూపట్టు ;
నీకొండఁ బశువుల నే మేపుచుండి
క్రిందిలోయలఁ గాముక్రీడలం గాంచి
సత్య మేఁ గనుఁగొంటి శ్రద్ధగా వినుఁడు !

రాత్రి లీలోయలో రక్కసులమూక
తోఁ గూడి కాముండు దుష్టచేష్టితము
లెన్నెన్నొ వెలయించు నెటొ మాయఁజేసి
దొడ్డిఁ బెట్టినయట్టితోఁడేళ్ళపోల్కి
లేళ్ళఁ గాంచినపులులలీలఁ దలపింపఁ
దనవారితోఁగూడి తటము మార్మ్రోఁగ
బొబ్బ లార్భాటముల్ భువి దివి నిండఁ
గాఁజేసి మనుజులఁ గంపిల్లఁజేయుఁ,
గుంభముల్ పోయించి కుంకుమఁ జిమ్మి
మాఱుమూలలయందు మారెమ్మఁ గొల్వ
నభిచారహోమంబు లతిప్రీతిఁ గూర్చుఁ ;
దెలియ కీమార్గమునఁ దిరుగాడుమనుజ
మత్స్యములఁ బట్ట బల్మాయలం బన్నుఁ.

ప్రొద్దుపోయినదాఁక మునిమాపు నేఁడు
మంచుగ్రమ్మినబీట మంద మేయఁగను
సెలయేటిగానంబు చెవి సోఁకినంతఁ
బద మొయిందు మైమఱచి పాడుచుఁ సమయ
మెంత చెల్లెనో కాన కే నుంటిఁ గాన
భావభంగావర్తవశుఁడనై పడితిఁ
గనుమూయులే దంతఁ గలకలం బాయె,

భూరుహంబులనుండి బొబ్బ లేతెంచి
గాలి యంతట నిండి గగ్గోలుపఱచె
నంత నాశ్రుతిపుటము లటు ద్రిప్పి వింటి
నాశ్చర్య మగునట్టు లాఁగె నాగోల.

నీలితెరమాటున నిలకడ లేక
కలఁగి పర్విడునశ్వగతి కోర్పుమాలి
నిట్టూర్పు లెడలించు నిద్రాధిదేవ
తకుఁ గొంత విశ్రాంతి దక్కె, నశ్వములు
భయ మింత డించి విహ్వాలతఁ బెడఁబాసె,
నీశాంతి యొకనిమిష మే నిల్వఁ గంటి.

ఇంతలో మృదులమై హృదయంబు లాగు
గీతంబు వినవచ్చెఁ గిన్నరియె పాడె

నన్వించె, ఘనసార మాయన్న తావి,
యత్తరుబట్టియం దావిరి పొల్కి-
వాయుగోళం బంత వ్యాపించి నిండె ;
శాంతమే యిట్టియశాంతిఁ దాఁ గాంచి
తనతత్త్వము న్వీడి తథ్యముగ నట్టి
చాంచల్యమునకుఁ దా స్థాన మిడెనేమొ ?

శ్రుతి విచ్చి వింటి నాశుభగీత మపుడు
మృత్యుముఖజీవి కమృతతుల్య మద్ది !
ఆగానమాధురి యాకలస్వనము
గుర్తుపట్టితి నంత గుండె ఝల్లనియె
మహనీయగుణరాశి మర్యాద కిల్లు
మీదుసోదరి యంచు మే నెల్ల వడఁకె
భయము విభ్రాంతియుఁ బలసి న న్ముట్టె
నతిదుఃఖ మటు నన్ను నాశ్రయించినది
ఆశ్చర్యమున నుఱక యట్టె నిలిచితిని
అసహాయురా లామె యనిపించె నాకు.

రమణి గీతం బట్లు రక్తిగాఁ బాడి
ఘోరవిషజాలంబుఁ గూడినను గనదు
జవముకల్మినిఁ బర్వ సాఁగితి నంత

మైదానముల నెన్నొ మైమఱచి దాటి
పరిచయవశ మైనబాటల నడచి
సందులు గొందులు చాలగా మీఱి
శ్రుతుల నాపాటయే సూటిగా నుంచి
పొంచి కాముం డున్న పొద చేరులోన
(కలదు కామునిజాడఁ గాంచనాకలవు)
నేమని తెల్పుదు నింతి యాకాము
తో మాటలాడుచుఁ దొందరగ మిమ్ముఁ
గూర్చి యడుగుచునుండె గొల్లఁడని చేరి ;
ఆయాస మంతయు నడియాస యయ్యె
నసహాయ, ముద్దరా లధములచేత
నేపాట్లు పడనున్న దేమౌనో యంచు
నిలువఁజాలక యొక్క నిమిషమున బాణ
వేగమున నిట వచ్చి విన్నఁడు మిముఁ గంటి
నతివ కేమయ్యెనో యటుమీఁద నెఱుఁగ.

తమ్మ. నిసి, మబ్బు, చాయలు, నిర్దయులు గూడి
ముగు రేకమై యొక్క ముదితమానంబుఁ
బోనడువఁ బూనిరి పురుషసింహములు ;
అసహాయురా లన్న నయిన నేమంటి
భయ మొందు కంటివి బదులాడ వేమి ?

అన్న. అగునయ్య యిపుడైన నట్లె పల్కెదను
నిస్సంశయంబుగా నిలుతు నద్దాన
విశ్వసించినదాని విడువ నెన్నటికి ;
నా యైంద్రజాలికు నదలింపు లన్ని
వానిదౌష్ట్యం బంత వ్యర్థమని తలఁతు.
దురదృష్టమును దిట్ట దుర్బుద్ధిమతము
లేహానో యనుశంక కిటఁ దావు లేదు.
మూర్ఖత యనఁబోకు మమ్మాటి కిదియె!
దుర్జాతి యెల్లపుడు దోషదూషితము
సాధులఁ బీడించు జయముఁ గనలేదు.

ధర్మ మెదలిన శక్తిఁ దలఁప నాశ్చర్య
మగుఁగాని సాధుల నంత బానిసలఁ
గాఁ జేయ వశమానె ? కష్ట మెంతైన
సుజనుల శోధించి శుభ మిచ్చుఁ దుదకుఁ
వనదౌష్ట్య మెంతయును దన్నె బాధింపఁ
డాఁ దప్పుగోతనే తాఁ గూలు శఠుఁడు!

దుష్టులకు సాధులకు దుర్ఘటము మైత్రి ;
యత్న మెంతయు వ్యర్థమైన దుష్టాత్ముఁ
డనిలవశేమునఁ గూడి యడరు నామేఘ

పంక్తులసాంద్రిత భాస్కరుం గప్పఁ
బ్రతిహతి నాజలదపటలంబుఁ దూలు
నటులె వర్ధిలు మాయ నతిహీనుఁ డగుచు.

దీనికిం దప్పిన స్థిరఖగోళంబు
కుప్పిల్లినగ్రుడ్డందు ; కొండల న్గాక
యెండుటాకులమీఁద నిలగట్టి రందు.
బ్రహ్మాండభాండములు పగిలిపోకున్న?
ఉదధు లేడును గలిసి యొక్కటై పోవె ?
కానిమ్ము రమ్మోయి ! కదలిపోవుదము.

ఈశ్వరధిక్కార మీఖడ్గ మెపుడుఁ
జేయఁగాఁ జన దనుజ ! చెనఁటి యాహ్వైంద్రి
జాలికుతంత్రంబు సమయింపఁజాలు.

వైతరణీనదీపతితదుర్జాతి
పాపరూపులు క్రూరపక్షిసంతతులు
చుట్టి కొల్వఁగనిమ్ము శోధించి వానిఁ
బాతాళమునన్నైనఁ బట్టి బంధించి
చెలియను రక్షింతుఁ జేఁజిక్కనీయ
మొలకు నటుగాకున్న ముంగురుల్ పట్టి
కడికండలుగఁ గోసి కాకిగ్రద్దలకు

బలియిత్తు భూభరము వాసిపోవంగ.

ధర్మ. అయ్యో ! యేమందు సాహసికుఁడవె యైన
నీఖడ్గ మిచ్చోట నిస్సహాయంబు.
సామాన్యసాధనాల్ చాల వీపనికి.
నీమాయ మాయింప నితరముల్ వలయు.
కుంచె నాడించెనా కూలుఁ గీల్బలిమి.
అంగముల్ ముద్దయై యాకృతు లడంగు.

అన్న. అటులైన నీ వెట్టు లామాయలానిఁ
గదిసి యీవార్తలఁ గని చెప్పనాయె?

ధర్మ. కన్నెమానముఁ గావఁగా నుపాయంబుఁ
బన్నునామది కొక్క భవ్యుండు తోఁచె;
యువకుండు సామాన్యనోజఁ జూపట్టు
నైన నేర్పుగలవాఁ డన్ని యోషధుల
శక్తి బాగుగఁ గాంచి సామర్థ్య మందె
మిత్రుఁ డాతఁడు నన్ను మిగులఁ బ్రార్థించి
పాటలఁ బాడించి పడసి సంతృప్తి
మృదువైనపచ్చిక మెయి వాల్చి వినుచుఁ
దన్నుఁ దా మఱచి యద్దానికి మెచ్చి
త్రోలుసంచిని విప్పి దురవగాహంపు

టోమధులఁ బదివేల నోలిఁ జేర్పర
సద్భుతంబు నమోఘ మైనశక్తులను
దెల్పి యందున నొక్కదివ్యమూలంబు
మహిమఁ గల దనియంచు మాయ మాయించు
నాకు నల్లనిదంచు నందుఁ గంటకమ
టంచును నద్దియే యన్యదేశముల
బంగరుపూ ల్బూచుఁ బ్రసవింప దిచటఁ
దెలియఁజాలరు దానిదివ్యమహిమలను
బందులు పెకలించి పాడ్వడఁజేయు
నర్జునుచే నున్నయాపాశుపతము
కన్న రక్షణ యిచ్చుఁ గలిమి గలదంచు
నదె సుదర్శనమంత యలవి కలదగుట
నాపదలఁ గాపాడు నని నచ్చఁబల్కి
మాయలఁ దొలఁగించి మాన్పు రోగముల
భూతాలఁ బోఁదోలి పూన్చు సౌఖ్యముల
నని తెల్పి నాకిచ్చె నది నాఁడు నేను
నుండనిమ్మని నంచి నునిచి దాఁచితిని ;
అద్దానియవసరం బాయె నిత్తఱికి
నన్నంతసత్యమని యనుభవం బాయె
జానుగ గుట్టెల్లఁ జని చూడ నాఘోఁ

గుమ్మరపుర్వెట్లు గూడి కర్దమమును
నంటక తా వచ్చిన క్లేను మాయ
దారులఁ జొచ్చినఁ దప్పిరాఁ గంటి.
ఈయౌషధి న్వెంట నిడుకొన్న మీరు
పుట్టెఁడుబల మున్న ముట్టి కోటంత
వానిఁ జూచినతోన పైఁబడి తన్ని
గాజుగిన్నెలఁ గొట్టి కలమద్య మెల్ల
నేలపాలుగజేసి నేర్పునఁ వాని
మాయదండము గొనుఁడు మలఁగు నాపదలు
తోడివారలఁ గూడి ధూర్తుఁ డామీఁద
నట్టహాసముఁ జేయు పలుకు పుట్టించు
నగ్నిపర్వతమట్లు లనిపింప మంటఁ
జూపించి పొగ లెగసి చుట్టు ముట్టంగఁ
గల్పించి తుదకుఁ దాఁ గన్మొఱఁగి యార్చు
ధైర్యమున నిల్వంగఁ దలఁగు నీచుండు.

అన్న. దారిఁ జూపుమ గొల్ల ! తత్క్షణం బీవు
వెన్వెంట వత్తుము వేవేగఁ జనుము
దివ్యకామిని కేలఁ దిరముగా డాలు
పూని నడువఁగఁ దోఁచె మున్ముందు మనకు.

(మువ్వురు నిష్క్రమింతురు)

## 3. దివ్యభవనము.

ప్రవేశము - కాముఁడు, సత్య.

కాము. అతివ ! లేవఁగఁబోకు మాజ్ఞ యిది నీకు
కూర్చుండు మోకాంత ! కోపపడఁబోకు
రన్వంత రుచి చూడు రాజ్య మేలించు.

ఈదండ మొక్కమా ఱేఁదిప్పఁగానె
ఆబొమ్మ వౌదువు రమణి ! నీ విపుడె
చొరరానివనములోఁ జొచ్చి యూర్వసియు
తీవయై పోయె నాతీరుగా నిన్నుఁ
పాదపంబవుగాఁగ బంధింపఁగలను
మంత్రశక్తుల కెందు మాఱున్న యబల !

సత్య. మూర్ఖ! ప్రేలకు మోరి ముట్ట న ద్దరమె ?
స్వేచ్ఛామనోవృత్తిఁ జెనక నీ కగునె ?
భౌతికశరీరమున బంధములు నీదు
మాయల నొఁగాక మందభాగ్యుఁడవు.
జయము ధర్మమె కాంచు సాక్షి యీశ్వరుఁడె.

కాము. చురచురఁ జూడంగ నుదతి ! యేమాయె
బాధ లేమాయెనే పడఁతి ! నీ కిపుడు

కోపతాపము లిందుఁ గూడవే యింతి !
స్వప్నమందేని దుఃఖవార్తఁ గన వతివ !
యౌవనోద్రేకమున నడరునూహాపఙ్క్తి
పంచసువ్యాప్తసుఖభావమాలికలె
కందు విచ్చోట నోకలికి ! యెల్లపుడు ;
కాలమున దీవ లుత్కళికలం దోడుగ
నోజన దరుణరక్త ముప్పొంగ నింతి !
తొలుత నీయమృతబిందుయుతపానంబు
స్వచ్ఛమైన యుపాధిఁ జల్లనిపరిమళ
ములఁ బిల్చుచున్నది ముదమునన్ గ్రోలు
మానాఁడు హరిసుధ నంది దివ్యులకు
నీయఁడే యటువలె నెంతయో ముదముఁ
గూర్చుఁ దాపము మాన్చుఁ గోర్కె లందించు
మృదువైన యంగముల్ మిగుల శోషిల్లె
క్రూరతఁ దనులతఁ గుములింప నేల ?
కార్శ్యమును బాటించి గాసిల్ల నేల ?
పడఁతీ ! ప్రకృతి యిచ్చు భాగ్య మంతయును
దాఱుమాఱుగఁ జేసి తప్పఁ జూచెదవు
మనుజదౌర్బల్యంబు మను దానఁ గాదె;
పాటువడ భోగంబు బాధపడ సుఖము

పగలెల్లఁ బనిసేయ వలయు విశ్రాంతి,
అతివ! నీతాపంబు లడఁచు నీమధువు.
సత్య. అంతయు నసత్యంబె యగు మోసకాఁడ!
సత్యదూరుఁడ వగుచు సద్వృత్తు లెడల
నడరునీజిహ్వాగ్రమం దసత్యంబె;
నీపూరియి ల్లంటె నీవాస మిదియె?
ఇదియె నీ విడురతు యింతులకు మూర్ఖ!
ఇట్టివికృతరూపు లీవింతదృశ్య
ములు నీయఁజాలునే ముక్తికాంతులను?

ఆదయామయుఁడె న న్నరసి పాలించు
నీయింద్రజాలంబు నీదు మోసంబు
సాధువేషము నూనసాఁగె నింతకును,
నమ్మకముఁ బుట్టించి స న్నిటకుఁ దెచ్చి
పశులఁ బ్రతారింప వలఁతిపానకముఁ
ద్రావించి మతి చెఱుపఁదరమె? నీచుండ!
అగుఁగాక యమృతమె యతిపవిత్రంబు,
దుష్టుఁడవు నీకరదూషితం బగుట
ముట్టి రుచిఁ జూడంగ మూర్ఖ! నే నొల్ల.
సాధుసంగతిఁగాక సద్వస్తు వున్నె?

సత్త్వ మేదిసదాన స్వాదుత్వ మున్నె ?
మితభుక్తి గలత్పుత్తు మెచ్చ దాఁసము.

కాము. శుభదంబు లైనట్టిశ్రుతు లన్నవంచు
మనువు చెప్పినధర్మమార్గ మటంచు
ఋషులు దెల్పినయట్టి ఋజుమార్గమంచు
నియతి, మితి, యింద్రియనిగ్రహం బంచుఁ
దాటాకులన్ వ్రాయఁ దథ్యమని నమ్మ
నరునిమూర్ఖత గాక న్యాయ మం దున్నె ?
ప్రకృతి గర్భభరంబు శ్రమ నాక తాల్చి
వితరణశీలమై వెత్తి లేకుండ
విశ్వ మంతయు నిండ విరితావిఁ జిమ్మఁ
బాఁడియున్ బంటయున్ బశువృద్ధి గదుర
జలజంతుసంతతి జలధి నిండార
నేమని ప్రసవించె నేల వెదఁజల్లె ?
ఆనందమును గూర్చి యభిరుచి వింత
భేదముల్ గనిపట్టి ప్రీతి మన కందఁ
జేయ నెంచియె కాక శ్రీలు నిష్ఫలము.

పట్టుపుర్వులు కోట్లు పనిపిని మృదుల
మాపట్టు పచ్చనియంగళ్ళ పడకఁ
గాంచుట సుతులజోక యలంకరింప.

ఏమూల నేకొదువ యింతయుఁ లేక
స్వీయసంతానంబు చెందఁగా సుఖము
పూజార్హమౌ సర్వభోగంబు లీయఁ
ధనగర్భగోళమున దాఁచె నవనిధులు,
రత్నరాసులు సాఁకె రక్తిగర్భమున;
ఇంద్రియనిగ్రహం బెంచి లోకంబు
కూరాకు సూపంబుఁ గూడుగా మెసవి
తెలినీటి తేటలఁ దీర్చి దాహంబు
ముదుకబట్టలఁ గట్టి ముసిపోవంగఁ
గలసిరి సగమైనఁ గాంచఁగా లేము.
కన్న దింతయు వెగటుగాఁ దోఁచు మనకు.
పరిపూర్ణదానంబు పాటింపకున్న
నందుఁ గృతఘ్నులమను బిరుదు మనకు;
స్తుతిపాత్రు నుతియింప సూక్తులే గనము;
కాసు వీడఁగలేని కడులోభిప్రభువు
సేవించుదాసునిసిరి యబ్బు మనకు,
శిశుసంతానంబు హీనగతిఁ గాంచుఁ,
బ్రకృతి తనభారముఁ భరియింపలేక
యడఁగంగ మనబ్రదుకు లతిభారమౌను.
ఆడదూపిరి సెడ నిరర్థకపుఁబంట

నేల క్రుంగఁగఁ జాల నెగడు సస్యములు,
ననిల మంధతమీఱి నడచు ఖగతతులు,
పాలించుప్రభు వేదఁ బశువు మితిమీఱుఁ,
గడలి నిండియుఁ బొంగఁ గ్రాల్ రత్నచయము,
లెత్తనివజ్రాలె యేచి తారలయి
యూఱక పడియుండు నుదధి నెన్నదుట,
లోలోనఁ దమకాంతి లుప్తమై చనఁగఁ
బెంపంది కొండలై విధిగ నిను మోముఁ
దేఱిపారఁగఁజూచుఁ దేలి సిగ్గది,
రారాజమకుటముల రాజిల్లుగవ్వ
లోడలు వగులంగ నుదధి మెయి వెంచు.

అతివ ! విను నామాట లడఁచు నీసిగ్గు ;
శీలమని వాదించి చెడి మోసపోకు.
అందమనఁగాఁ బ్రకృతి కగునాణె మదియు
మాఱుచుండఁగవలయు ; మహిఁ బూడ్చఁదగదు.
అందలియాధిక్య మగుఁ బరస్పరము
భాగించి భోగింపఁ, బరమార్థ మిదియ.
వివిధభోగములందు వెగ టున్నె బేల ?
యుక్తకాలము దాఁట నువిద ! నీధనము
కోయనిపూ వట్లు కొమ్మనే వాడి

తల వాంచి సశియించుఁ దారుణ్య మొడలి.
అంగడిఁ బెట్టనగు నాసందప్రకృతి
రాణివాసముఁ జేర రాణించు నెట్లు ?
ఉత్సవంబుల రచ్చ నుయ్యెలల నూఁపఁ
జనితసము భావించి పరులు మెచ్చెదరు.
సంసారపక్షుంప్రసారస గృహమందె
దాన సంసారియగ దగునామ పజ్బె ;
చెన్నెది బిగిసునా చెక్కుటద్దములు
పసలేక కళ డిందువడు దేహకాంతి
యింట దాసిగ నుండ నీడౌనుగాక
నూలు వడకుటకైన నుదుటివ్రాలగుత ;
చదలేటిబంగారుచాయ గలమేను
తుమ్మెదబారుతోఁ దులఁదూఁగు వేణి
శితకాండజాలమ్ముఁ జిమ్ముకన్దోయి
యంటి మీటిన విచ్చు నధరబింబంబు
భాగ్యముల కిక్కయా వగువంపుజోడు
సంసారబంధముల సరిగట్టఁ దగదు.
అర్థాంతర మగునీయందచందముల
తారుణ్యవతి వీవు తలపోసి చూడు.
తగుమానిసిని వినఁ దగదె నామాట ?

సత్యః- (తనలో)

నిరయవాతావరణనికటదేశమున
ననువుగా దెటు మాటలాడంగ నాకు.
బాహ్యాదృష్టులఁ గట్ట వశ్యమైనట్టు
లపధర్మసూత్రముల్ న్యాయమని పల్కి
యంతఃకరణవృత్తు లాఁగఁగాఁ దలఁచె.
పాపి ప్రత్యేకించి వాదానుకూల
మైనయుపపత్తుల నందముగఁ జెల్వ
నాగర్వ మడఁగంగ నప్రతిహతంపుఁ
బ్రతివాదములు సల్ప బల మెంతో యుండి
ధర్మ వూరకయున్నఁ దప్పు లోకములు.

(ప్రకాశముగ)

పూఁతపంటవలంతి పూర్ణగర్భంపు
ఫలము తెగతినఁగ సుతు భాషించె నంచుఁ
బశువ ! ప్రకృతి దూఱ భావ్యంబు గాదు
సుతులసౌఖ్యమె కోరుసుజనని యట్లు
నియమబద్ధముగాఁగ నిజజీవనంబు
గడుపుధన్యులకుఁగాఁ గల్పించె ఫలము.
ధనమదకామినీదత్తసురభోగ
సంతతిపోకలై చని యచ్చటచట

విషయసుఖములె మెచ్చి పెనుగరువ మూను
నొకరిద్దఱిని ముంచి యూపు డోలికల.
దారిద్ర్యమున స్రుక్కు ధర్మాత్ములకుఁ
దగుభాగ మందినఁ దలఁగు భూభరము.
అపుడె ప్రకృతిఁ గన్న యుజ్జ్వలఫలరాజి
చక్కనియుపయుక్తి సమభుక్తిఁ గాంచు
నపుడె యీశ్వరుఁ డందు నభినందనంబు
లపుడె నుతు లందినటు లానందమందు.
తిండిపోతులు తఱుచు తిని భత్త్యవితతి
స్వర్గముఁ గనలేరు పశుత దము ముట్ట.
విశ్వాసరహితులై వీథిఁబడి జంతు
సమకృత్యములు పూని చవుల కెగఁబ్రాఁకి
నిందలపాల్సేయు నిజమాతృగృహము.
వివరింపఁగల దెంతొ వినుము చెప్పెదను
వలసినంతయు వింటి వలదందు వేమొ ?
సతిమానభంగంబు సమకట్టు నెవఁడు
వినరానిమాటలు విన్పించు నెవఁడు
వానికిఁ దెల్పఁగా భారతము గలదు;
కాని యుపయోగంబు కాసంత లేదు.
పడఁతికి శీలంబె పదనైనకత్తి

దానితత్త్వముఁ దెలియ ధాతకేని వశమె ?
ఆవ్రితశక్తియు నాధర్మపథము
విప్పి చెప్పఁగ నాకు విధియైన నేమి ?
ఆత్మశుద్ధియు దాని కనువైన సత్ప్రీతియు
నంతరించినవాని కర్థంబు గాదు.
నీవంటిపాపికి నిర్వ్యాస్యనకును
నీకల్లుకొంపయే నిత్యభోగంబు ;
తెల్పఁగూడదు నీకు దివ్యతత్త్వంబు.
అజ్ఞానతిమిరంపుటావరణ మంది
వికట మగుచాతురి వింతశాస్త్రంబు
భ్రాంతిఁ గొల్పెడువాదపరికరంబులను,
సమకూర్చి భోగింప సరసుఁడవు నీవె !
మూర్ఖులవాదంబుఁ బూని యొప్పింప
బ్రహ్మకైనను వశమె ? భావింపఁ దరమె ?
అయిన యత్నముసేసి యకలంక మపరి
మితమూల్యశీలంపు మేలైనశక్తి
భావింప నాత్మలోఁ బ్రభవించునగ్ని
కీలికామాలలు కెరలి వ్యాపింపఁ
గరఁగుఁబో ఱాగుండె కరుణించినట్లు.
పులకరించినయట్లు పుడమి కంపింప

నేలమట్టముదాఁక నీమాయకొంప
పడి కూల నీశిరము పగిలిపోకున్నె ?

కాము:— (తనలో)

సతి పల్కుసది యంత సత్యమని తోఁచె
నతిలోక మగుశక్తి యడరెఁ బల్కులను
మానవాతీత మగుమహిమ గన్పట్టె
భవమాది గనసట్టిభయ మాయె నాకు ;
నస్వేద మనిమేష మమరభావంబు
నయిన దేహము నిండి వ్యాపించె, నుంచు
వలెఁ జల్లనై కంపభాజనం బైన
స్వేదజలపూరంబు చిత్రముగ నిపుడు 1070
మర్త్యత గన్పట్టె ; మహా ననసూయ
ముమ్మూర్తులను బాలమూర్తులుగఁ జేయ
నమరు లందఱును భయమందినటువోలె ;
సత్త్వంబు వెలయింప సమయంబు వచ్చె,
నతివబలమును జూడ నవసరం బిదియ.

(ప్రకాశము)

నీయుపన్యాసంబు నిలుపు మాయబల !
నీశుష్కవాదంబు నీనీతిగతులు

మాసంఘనియమముల మర్యాద మీఱె.
వినఁజాల నిఁక మీఁద వెలఁది ! నీనుడులు
వెఱ్ఱియెత్తినవారి పేర్లిడము లనెద.
పిచ్చిమాటలు మాని ప్రీతి నీరసముఁ
గ్రోల వెఱ్ఱియుఁ గుదురుఁ గుదురు చేకూరు.
ఒకబొట్టు చవిఁగొన్న నుత్సాహ మొదవు,
దైన్యంబు హృదయంపుదౌర్బల్య మడఁగు
స్వప్నసౌఖ్యము మించు భాగ్యమే యబ్బు.
చిన్నిబుద్ధులు మాని చింత లటు ద్రోసి
తిన్నఁగా బుద్ధిమై దీనిఁ జవిచూడు.

ప్రవేశము - కవలు

(ఇర్వురివాక్యము)

ఓరోరి నీచుఁడా ! యోరిదుర్మదుఁడ !
అబలను నమ్మించి యాగడము సేతె ?
ఈఖడ్గధారల నింతింతఁ జేసి
నినుఁ గాకిగ్రద్దలకు నింపుబలి యిత్తు.

(పరివారముతోఁ గాముఁడు పర్విడును)

ఆగు మోరీ పంద ! యతివవలెఁ బాఱ
నీ కెవఁడు బోధించె నీచాతినీచ !

(తనలో)

వీనితో మన కేల వెలిఁబడ్డచేఁప
పురుషుఁడే ? కాలికి బుద్ధులు చెప్పె.

(ధర్మదేవత బయల్పడి)

అయ్యయో ! విడిచితిరె ! యీమోసగానిఁ
దప్పఁదలఁచితి రీరు తత్క్షణము వాని
కట్టె లాగియుఁ ద్రాటఁ గట్టఁగావలదె ?
ఔఁగట్టిసంకెలల రమణి పడియుండెఁ,
గట్టెను దలక్రిందుగాఁ జేసివైచి
మాయను నడలించుమంత్రముల్ చదువ
లేవఁగల దందాఁక లేదు కార్యంబు.
అయినఁ బోయినదేమి ? అడలఁగా వలదు
స్మృతిఁదగిలె నొకయుక్తి మేలగును మనకు.
అలవడెఁ గిన్నరీధ్యానగీతముల
సమకూడెఁ గవి గన్నసత్యదృశ్యముల.

కల దొక్కకన్నియ కడు సాధుశీల
కన్యభావము చెడదు కాలంబు చనిన
పేరు సరస్వతి ; విబుధునితనయ
ఇల్లాండ్రు విబుధున కిరువురు గలరు.

జ్ఞాన మజ్ఞానంబు సవతులై పోర
జ్ఞాన మిల్లాలగుటఁ జాలలే కంత
సహాలు డొంకలుఁబట్ట గూఢముగ దానిఁ
గూడి కన్నియఁ గాంచి గుప్తముగ సాకె.
అజ్ఞానసతిఁ గూడి యవివేకిసుతునిఁ
గాంచి కష్టము లంది గాసిల్లి యంత
ధైర్యమున సతీసుతులఁ దరిఁజేరనీక
జ్ఞానసరస్వతులసరసకుం జేర్చె.
తగువారి నీర్ష్యాదితాత్పర్యమతుల
సాయమున నవివేకి జననితోఁ గూడి
తండ్రిని రణమందు దయలేక చంపె.

సుఖముగా నేలుబడి సుతునితోఁ గనుచు
సజ్ఞానసతి సవతి నాసరస్వతినిఁ
గట్టించి బాధించి కడకు నిర్వ్యరను
గంగయమునలు గలియు గంగలోఁ ద్రోసె.
నాఁటనుండియుఁ గన్నె నామమున లోనఁ
బ్రవహించునది సరస్వతియంచు నొప్పె.
అతిపూతచారిత్రి యాముద్దరాలి
శీలంబునకు మెచ్చి చెలు లగుచు గంగ
యమునలు ప్రవాహంపుటడ్డాల నాగె.

నదిలోనఁ గ్రీడించునాగకన్యకలు
ముత్యాలముంజేతి మురియను గొంచు
నాగేంద్రుముందట నయమార నిల్ప
నతివదుస్థితిఁ గాంచి యాసిగముఁ జూపి
స్పర్ధఁ దంతాట జాలి నెల్లెడ పొంగఁ
వేగఁ గన్నియాశిరము స్పృశియించి తేనదా
కూఁతుల కిడ సమ్మతిగుండ పిలు దాఁచి
యటమీఁదఁ బన్నిట సంగములు నడుప
నింద్రియద్వారముల నింకె సమ్మోదంబు
జీవలత చిగురించెఁ జెలియ జీవించె
నతివ మృత్యువు దాటి యమరత్వ మంది
సంత నదీదేవతాఖ్య విలసిల్లె.
నేఁటికిని గన్నెయై నియమంబు నిల్పె.
మందల మునిమాఁపు మైదానమందు
మలఁగుచు నిచ్చలు మారికాగణము
తుదిప్రభాతముఁగూర్చు శుభదూరమైన
చేష్టలఁ బసిఁబట్టి సిద్ధమూలికల
సమ్మిశ్రితం బైనసరసజీవనముఁ
జిలికించి పోఁగొట్టు జేజే యటంచు
గొల్లఁడు నుతిసేసి కొలుపు లందించు.

సుతిఁబూని యాగొల్ల సుద్దిఁ బాడుచును
నుత్సవము సాగించు నట్టికోట్ల నొకఁడు.
మల్లెలు మొల్లలు మఱి విరజాజి
సరములు గులాబులు సంపెంగవిరులు
కొల్లలుగ నాయేఁట గొల్ల లర్పింతురు.
ఆకమ్రకిన్నరీధ్యానగీతంబె
ముమ్మాటికిని దెల్పె మనుగుడసత్వులను.
శీలపరిభావమున సిఁగులను బాపు
నమృతధారాపరివాహంబుగా గీతి
కామధువుఁ జిల్కెడుకంఠంబు నెత్తి 1160
ధ్యానించి పిల్వంగఁ దరుణి వే వచ్చి
సంకెలలు సడలించు సతి లేవఁగల్గు.
కన్నె మానముఁ గాచుఁ గాంతసువ్రతము.
ఆపదలు తరియించె; ననుభవము మెండు.
అసహాయురా లంచు నడ్డుపడితీరు.
యత్నించి చూచెద నానందగీత
మొకయింత సాయమై యుత్సాహ మీయ.

( గేయము )

అందంపుభారతీ! ఆగి నీ వున్నచో
టనె యుండి వినుచుఁ గష్టమునాక నాగీత

మున నద్దమును గాంచి ముదమున నిటురమ్మ.
అద్దంబువలె స్వచ్ఛమై స్నిగ్ధమై చల్ల
నగు నలలయడుగునఁ హాయిగా వసియించి
కమ్మతావులఁ జిమ్ము కబరికాభాగమునఁ
గలువపూవులు దెచ్చి కట్టి వేణిక గాఁగ
నల్లుకొనునిఁక దలఁతు నాలకింపవె, మాన
మునఁ బ్రీతి గాదఁ గే, యల వెంగిసులలోయ
వెలసిన దేవతవు, వేడెదను భారతీ !
వినుమమ్మ మాముందుఁ బ్రీతిగా నిలుమమ్మ.
ఉదధీశుపై నాన యుంచి పిల్చెద నమ్మ.
వరుణదేవత యిచ్చుభాగ్యరేఖవె యాన
శేషాహిపడగలశ్రీఖులే యాన
గంగయమునలమత్తగజయానమే యాన
ఇంద్రనిశితధార యేడేడువాయువుల్
కృష్ణనీరదగర్భకీలితవిద్యుత్తు
లేటితరగలఁ దూల్చు నింద్రనీలఁపుఁదమ్మ
సోగలై నాచువలె సుళ్ళఁ దిరిగెడుకురుల్
కలువకాడలఁ బోలుకరపాళికాతతుల్
పద్మశోభల మించుపాదముల్ వదనముల్
భర్మకలశంబులఁ వహియించి జతఁగూడి

ఇలకేళి సవరించుజలకన్యకలె యౌన,
నిసినిసి నీనీట నీతీరములయందు
నచ్చంపుమగఱాల నాసీనలై నెఱుల్
చిక్కుఁదీయుచుఁ జూపుఁజిలుకులు వఱపెడు
పాఁపకన్నెలయాటపాటలే యౌనగా,
బృంద చూపినశక్తి, వేదవతియోగంబు
సీతదమయంతులచిత్తశుద్ధులె యౌన,
పవడంపుసెజ్జ విడి భారతీ ! లేలెమ్మ,
నీభంగరభసంబు నిలఁగట్టి యొకయింత
మాకార్యమును దీర్చు, మర్యాదఁ బాటించు
విశ్వాస మది యుంచు వేడెదను భారతీ !

(వినవె రక్షింపవే)

ప్రవేశము:- సరస్వతి - సఖులు

( పాట )

సర:- ఏటిదరి దట్టముగ నేచి పూచినరెల్లు
నీలివావిలిప్రబ్బ నిండారఁబ్రాకిన
నీటిపట్టులయందు నీడవలెఁ గదలునా
రథ మిప్పు డాపితిని, రత్ననీలపుసిరుల్
భాసిల్లు సుప్వాంగుభంగమాలికలందుఁ,

గమలగంధము లోలయుకలయంపిజల్లులన్
ముత్యాలకంకణాల్ ముగ్గులసొబగందు
చంద్రికాసారంపుసాంద్రతోరణరాజి,
నవరత్నరుచులవిన్యాసంపుఁదీరు
ప్రతిబింబితప్రాంతభర్మకదళీతరు
కాండనిర్మితరాజగంభీరవాహినీ
పదమున, భద్రముగఁ బంకరుహములమీఁదఁ,
గాలూనఁ గందనికలువరేకులమీఁదఁ
బాదమూనిన గుర్తుపట్ట శక్యముగాక
వచ్చితి, ధర్మదేవతవమ్మ! నీప్రార్థ
నల్ వృథా పోఁజన్నె? న్యాయమే జయమందు;

"పిలిచినపని యేమొ వినిపింపు మమ్మ."
ధర్మ:— క్రూరమతి యసహిత్రు గూఢతంత్రమునఁ
బహుశక్తి, యవినీతి, బలయుక్తికతన
సతిశీలసత్త్వంబుఁ జైతన్య మాఁగె.
మా ప్రార్థనల్ విని మాయమ్మ యిపుడు
తుచ్ఛనిమాయలఁ దూల్చి నీశక్తి,
కట్టువీడఁగఁజేసి కారుణ్యమతిని,
సతిజీవములు నిల్పు చైతన్య మిమ్మ.

సరస్వతి:— ఖలతంత్రములఁ జిక్కి కన్నె మానంబుఁ
గావ నాధర్మంబగా గొల్లవాఁడ!
(భరత సతివంక దృష్టుల నునిచి)
తేజస్వినీ! నన్నుఁ దిరముగాఁ జూడుము
పరమౌషధము లివి పావనవిమల
వాహినీగర్భసంవర్ధితకమల
సరససుధామోదసాంద్రకణము
లౌషధప్రాయంబు లడఁచు రోగములు
నీయుష్మకుసుమములు నిండఁ జల్లితిని,
ముమ్మాఱుఁదె కరాగ్రములయందుఁ జల్లి
యధరప్రవాళముల సల్లఁ జిల్కితిని,
అంటుఁగార్చ్యపుటసము లలముకొన్నట్టి
చలువనౌసత్తుల సడలింపఁ జాలి
చెమరుచు చల్లనిచేత నంటితిని ;
మాయమంత్రపుశక్తి మచ్చుమాసినది ;
ఉదయాద్రి నరుణరుచు లొలయుటకు మున్నె
గంగామహాదేవి కాంతకుంభమున
నిల్వ వేగము పోవ సెయుము మది నాకు.

(అదృశ్య యగును)

(శారద యటు పోవ సతి యిట లేచె)

ధర్మ:— (ధ్యానించుచు సరస్వతి నాశీర్వదించును.) .

గండ్రి వివేకంబు తాత సత్యంబు
ధర్మమే శీలంబు తాత్పర్యమతిని
మానినిన్ రక్షించి మహిఁ గీర్తిఁ గంటి.
నీయుపకృతి మఱువనేర్తు నెవ్వాఁడు !
నిండుజీవనవృద్ధి నీ కగుత మెప్పుడు !
తటము వ్రాంగఁగఁజాలుతెరఁగగమి వరల
నుంచుమల చఱియల మలఁగి ప్రవహించు
సెలయేటికన్నియల్ చెలఁగి మొగఁబెట్ట
కుండఁ బరిపూర్ణకర మొగి నిచ్చుఁగాత !
వేసంగివెట్టలును వేడిగాడ్పులును
నెఱులు మించిననీదు నెఱికురులచాలుఁ
గంపింప శోషింపఁ గాకుండుఁగాత !
శిశిరశరదాపగాజీవకల్లోల
చండోద్ధతుల్ పంకసాత్కృతము గాక
కరఁగినపటికంపుఁగాంతుల నీను
నీజీవనఁపుఁదెరువు నిర్మలం బగుత !
పటికంపుఱాలను బసిఁడిపంకంబు
నేటిదరి నీతరగ లెగఁబోయుఁగాత !
రమ్యహర్మ్యంబుల రాజనగరములు

రమణ నీశిరమున రంజిల్లుఁగాత !
ఏలాలవంగలత లీకముల నల్ల
సటనట నీతటము లందగించుతను !

(సఖినిఁ జూచి)

కన్నెరో ! రావమ్మ కదలు మతివేగ.
ఈశుఁ డిచ్చినయూఁత యింత యుండఁగనె
యీనరకము న్వీడి యెగిరిపోవలయు
మాయలాఁ డేదైన మర్మంబు పన్ని
యాలసించిన మనల నరికట్టనోపు.
పుణ్యభూమిని మెట్టఁబోవునందాఁక
మాటాడఁగా రాదు మసలఁగాఁ జనదు.
ఈసాంద్రవనభూమి నిరు లేచియున్న
దారిఁజూపుదు, నమ్మ తరలు నావెంట
మీతండ్రినగ రిటకు మెలఁత యొకక్రోసు
నుండ దీరేయి యట నుత్సవంబందు
సభఁదీర్చి రాజుండ సామంతమిత్ర
బృందము లభినుతులఁ బ్రీతిఁ దెలుపంగఁ
గూడిరి దర్శనముఁ గోరి ముదమంది.
ఒడయని కానంద మొనగూర్చుటకును
నటవిటగాయకుల్ నాట్యపరివేష

ముల్ సల్ప సిద్ధముగఁ బొలఁతి ! తా రుందు౹.
నృత్తగీతములందు నేర్పు లేర్పడఁగఁ
జూచి సంతసమంది సోలి వా రుండఁ
దటుకున మనరాక తథ్యముగ వారి
ముద మినుమడింపంగఁ బోయి కలియుదము.
నాతిరో ! పద పద నక్షత్రరాజి
యుడువీథి కెగఁబ్రాఁకియున్న నేమాయె
నడిమింట రేవెలుఁగు నవ్యముగ నుండె.

( వడఁకుచు )

అల్లదే కనుఁడు మాయానందపురము.
దిశలెల్ల వెలుఁగొందె దీపంబు లవిగొ.
ఇదె నగరినటకులనృత్యంబు సాఁగె
మద్యమత్తత వీరు మనరాకఁ గనరు
తొలఁగ మార్గముఁజేతుఁ దోడనే రండు.

( గేయము )

మిన్నకే తొలఁగుఁడు మీయాట చాలు నిఁక
మంచిగొల్లలు రండు మలియుత్సవమునాఁడు
మీగొల్లసుద్దులు మీతాండవంబులు
మెచ్చనాయెను వినుఁడు మేలైనమృదుగాన

లాస్యనృత్యములకలాపముల కదనాయె.
లలితమృదుపాదకమలంబు లానందగిన
రంగప్రదేశంబు రాజమణిహర్మ్యంబు
నారదనృత్యంబునకు నుద్దియైనట్టి
నీలంపుటుదువీథి నీకైనమగరాల
నిగనిగల్ దగఁజిమ్ము నిద్దంపుసేల్వావలెఁ
బసిరికపట్టిన పచ్చనిజయఘుల
వనకన్యకలు నూపుపాటనంబును మీఱు
వాల్లభ్యమును గన్నవార లిటు వచ్చిరి!
మిన్నకే [illegible]లఁగుఁడు మీయాట చాలించి.

(ధర్మవు తల్లిదండ్రులకుఁ బిల్లల నప్పగించును.)

"తల్లిరో! ఇటు రమ్మ తమ్ములు నీవు
మీజనని జనకుండు మీ మ్మాదరింతురు."

( పాట )

ఓరాజ! ఓరాణి! యుత్సవసమయమున
సంతోషసామగ్రి సమకూర్చి తెచ్చితిని.
చూడుండు చక్కఁగా సోగసై పెరిగినవి
మూఁడుకొమ్మలు మీకు ముచ్చట యనిపించు.
ఉడుకుశోధనఁజేసి యుక్తకాలమునందు

శక్తిఁగాంచియు విభుఁడు సాధించి మెచ్చెను,
శాంతివిశ్వాసంబు సత్యధీతత్త్వంబు
లసిధారపై నిల్పి యచ్ఛమని పరికించి
పంపె నీకడ కిపుడు పండె నీకోరికలు
సుస్థిరంబగుకీర్తి శుభకిరీటంబులు
శిరమునఁ దాల్చెద, చిదూర్మివుపరపూర్ణ
కారుణ్యమాలికాకాంతులు వ్యాపింప ;
విషయవినిపాతంబు విధిమీఱుహృదయంబు
జయశీలురకు లొంగెఁ జక్కఁగా సళియించెఁ,
చాటనగు విజయంబు జయజయధ్వనులతో.

( ఆటపాట లాగును )

భరతవాక్యము.

ధర్మదేవత:— ఇపు డబ్ధికడల కే నెగిరిపోయెదను
ఇరులు గ్రిమ్మక యెచట నిసకాంతి యెసఁగు
నతివిశాలము నున్న తాంతరిక్షమున
నాకల్పసుఖపద మందఁగాఁబోదు.
నందనవనసుములో నారదుఁ డొకట
గంధర్వకిన్నరకన్యకలు నట్లె
యప్సరోగణములు నందందుఁ జేరి
కల్పకుజములనీడ గానంబుసలుప

వీనులవిందుగా వినుచు శ్రమవాయ
విమలవాయువుఁ బీల్తు వేల్పులఁ గూడి.
కుంజపుంజములందుఁ గోమిరెజొంపముల
వాసంతవనలక్ష్మి పరువంబు పొదలె.
సర్వర్తులక్ష్మి తనసారవస్తువుల
సంగడి వెలఁగొనక యమ్మికము సూపు.
క్షుత్పిపాసలు లేనిసురకాంత లవ్వి
కైకొనక ముట్టక కని యనుభవింతుర్.
మలయమారుత మొలయు మంచిగందంబు
కమ్మకస్తురితావి గలసి పెనఁగొనఁగ.
ఏపుగా భూజముల నేలాలవంగ
వీరుధు లెగఁబ్రాఁకఁ బెరసె నెత్తావి.
ఇంద్రచాపవిభూతి నెకసక్కె మాడు
నిగ్గు గల్గినపూలు నెత్తావి మిగుల
విరియఁగాఁ దీరముల విధుకరశిశిర
జలసేచనము సేయుసాధ్వి నిర్ఝరిణి.
కాటుకకళ లీనుగాఢతమాలి
కారమ్యవాటికల కాళిందివాలు
కాతీరములయందుఁ గంసాదిక్రూర
రాక్షసులఁ దునుమాడి రక్షించి జనుల

కృష్ణుండు పలుమాఱు క్రీడించె నెచట,
కలికి రాధికఁబట్టి కన్మొఱఁగిపోయి
శ్యామతమాలికాచ్ఛాయలు గప్ప
యమున నల్లనినీట నగుపడకయున్న
నెందెందు రాధిక వెదకెఁ గరుణముగ,
నా తావులను దాఁటి యూఁగకే పోదు.
వారితనయుఁడు రతిప్రాణనాథుండు
స్మరుఁడును మారుఁడు మనసిజుఁడు నాఁగఁ
బేర్వడ్డ పూవిల్తు పెద్దఱిక మంత
నీశుకోపాగ్నికి నింధనముగాఁగ
నాతి నదులే పొంగ, నగములే కఱఁగ
బిట్టు రోదనసేయ విని జాలిఁజెంది
దేవత లాజంట దివ్యతఁ బొంద
దీవించి కలిపిరి దిశలు వెలుఁగొందె.
యౌవన మానంద మనఃకవల లంత
మారునకు రతికిని గుమారులై రెలమి !
పట్టినకార్యంబు పండె శాంతముగ.
పర్విడుదు నెగురఁగలఁ జంటవలంతి
కడలంది మీఱిపోఁ గలను దుప్రిటిలోన,
నింగి నేలయు నెచట నిలిచెఁ గౌఁగింట

నట కేగి మొగిళుల నంటిపోఁగలను.
కలువవలె రాజుతోఁ గాంతు విశ్రాంతి.
ఉడుగణములో నొక్క యువిదనై యుందు.
అనుసరింపఁగ నన్ను నాన మీా కున్న,
మర్త్యులీ రమరులై మన నిష్ట మున్న,
మహి వీడి దివిఁ గాంచ మన సింత యున్న,
నిహమందె స్వర్లోక మింద్రభోగంబు
నందుకొనెడునదృష్ట మావంత యున్న,
శీలమే ప్రాణమని చిత్తమున నిడుఁడు !
శీలమే యిల నెందు స్వేచ్ఛావిహారి !
బ్రహ్మాండములు మీాటి పరముఁ దిలకింప
స్వర్గ మందఁగ నేర్పు వరశీల మిచ్చు.
దుర్బలత శీలంబుఁ దూలిపోకున్న
విభుఁ డొక్కఁ డుండె ననువిశ్వాస మున్న
గోవువెంటను దగులుకోడెవలె విభుఁడు
వెన్నంటి సర్వథా ప్రియముఁ గల్పించు.
బల మిచ్చు శీలసంపదల నిలఁ బెట్టు
ధర్మమే దైవంబు తథ్య మిది నుండి.

ఓం తత్సత్.

# స వ ర ణ లు

---

1 పుట 10 పంక్తితుద నిలుపుచుక్కను
12 పంక్తిలోని 'తరణి' తర్వాతఁ జేర్చవలెను.

42 పుట 778 పంక్తిలోని 'శేమానో' యనుదానిని
'ఏమానో' యని చదువవలెను.

59 పుట మొదటనున్న 'తవలో' యనుదానిని
'తమలో' యని చదువవలెను.

## స్నేహలతా కవితాసంఘ ప్రచురణములు.

| | | | |
|---|---|---|---|
| 1. సరస్వతీరామాయణము ఉత్తరకాండసహితము - 1200 పద్యములు. | | | 1-0-0 |
| 2. సుందరకాండము | ... | ... | 0-4-0 |
| 3. ఉత్తరకాండము | ... | ... | 0-6-0 |
| 4. సరస్వతీశతకము | ... | ... | 0-2-0 |
| 5. పతివ్రతాశతకము | ... | ... | 0-4-0 |
| 6. భారతసీతలు | ... | ... | 0-4-0 |
| 7. పోతన్న భక్తివైరాగ్యములు | ... | ... | 0-2-0 |
| 8. లక్ష్మీశారదాసుభాషితము | ... | ... | 0-8-0 |
| 9. రాఘవశతకము | ... | ... | 0-2-0 |
| 10. మాధవశతకము | ... | ... | 0-2-0 |
| 11. ధ్రువచరిత్రి | ... | ... | 0-4-0 |
| 12. లలితాశతకము - హంసతారావళి | | ... | 0-4-0 |
| 13. వీరగాథలు | ... | ... | 0.5-0 |
| 14. సత్యనారాయణ స్తవరాజము | ... | ... | 0-2-0 |
| 15. వైజయంతివార్షికపత్రిక | ... | ... | 1-0-0 |

మఱికొన్ని గ్రంథములును గలవు. మొత్తము సంఘము నుండి 40 గ్రంథములు వెలువడినవి.

4 సంపుటములు- పోష్టుఖర్చులతో రు 5 లకుఁ బంపఁబడును.

చిరునామా :-

ప్రెసిడెంటు, స్నేహలతాకవితాసంఘము,
కొల్లాపురము,
మురవకొండపోష్టు,
కర్నూలు జిల్లా.

